# శ్రీ అంబరీషాఖ్యానంబు

[జాతీయ మహాకవి

బమ్మెఱ పోతనామాత్య

ప్రణీతము]

సంకలనం

భాగవత గణనాధ్యాయి

సౌజన్యం

https://telugubhagavatam.org/

2024

# పూర్వ పీఠిక

పోతన తెలుగు భాగవతం బహుకథన సమాపూర్ణం. భక్తి రక్తి కలగలసి మనల మైమరపించే మహాద్భుత బృహద్గ్రంథం. భాగవతము భాగవత కథలు మధురమైనవి, పరమ పుణ్యప్రదములు. భాగవతమునందు సృష్ట్యాది నుండి బ్రహ్మప్రళయాల వరకు, చతుర్దశమన్వంతారాల విశేషలనుండి, సూర్యవంశ, చంద్రవంశ వర్ణనలు, ప్రజాపతుల, మహర్షుల వారి వంశాల వర్ణనలు అనేకానేకం మహాద్భుతాలు ఉన్నాయి. అందు చెప్పుకోదగ్గవి భగీరథుడు, శ్రీరాముడు, అంబరీషుడు మున్నగువారు ప్రవర్తిల్లిన సూర్యవంశ వృత్తాంతములు.

అంబరీషుడు అతి విశిష్ఠమైన మహారాజు. సూర్యంవంశలోనే కాదు మొత్తం రాజుల చరిత్రలోనే వీరి చరితం అపూర్వం, ఎంతో విచిత్రం, బహువిధ శ్లాఘనీయం. వీరు నభగుని చిన్న కొడుకు పరమధర్మిష్ఠి అయిన నాభాగుని పుత్రులు. వీరి ప్రపౌత్రుడు రథీతరుడు, రథీతర అంగీరస గోత్ర మూలపురుషుడు. మహావిష్ణు భక్తులు. అంఖండ సామ్రాజ్యానికి చక్రవర్తిగా వెలుగొందిన మహాసమర్థుడు. చెడునడతన్నది లేదని పేరుపొందినవాడు. సకల సద్గుణ సమేతుడు. నారాయణుడు రాజర్షి విచిత్ర వర్తనకు సంతసించి తన సుదర్శన చక్రాన్ని అంబరీషుని రక్షిస్తూ ఉండమని అనుగ్రహించాడు. అంతటి మహానుభావుడు ఆయన. ఈయన చరిత్ర పుణ్యప్రదము. సజ్జనుల ఎడ చేసిన ఎగ్గు ఎక్కువగానే పీడిస్తుంది అన్నదానికి ప్రత్యక్ష నిదర్శనం. ఎంతటి వాడైనా తప్పించుకోలేడు అన్నది నిత్యసత్యం.

విశ్వామిత్రుడు వీరిని పరీక్షిద్దామని వచ్చాడు. సమయం చూసుకుని, ద్వాదశ ఘడియలు తక్కువగా ఉన్ననాడు, అంబరీషుడు ఏకాదశి వ్రతానంతరం ద్వాదశపారణకు సిద్ధం అవుతుంటే వచ్చాడు. అతిథిని అన్నంపెట్టు, స్నానంచేసి వస్తానని నదికి వెళ్ళాడు. ఋషీశ్వరుడు ఎంతకీ రాడు. ఓ ప్రక్క ద్వాదశ

ఘడియలు దాటిపోతున్నాయి. ఈలోపున ఆహారం పారణచేసి స్వీకరించకపోతే ఏకాదశివ్రతం భగ్నమగును ఏమి చేయవలె.

పైగై అతిథి కన్నా ముందు భుజించరాదు. అసలే దుర్వాసమహర్షి మహాకోపిష్టి అతిథి. కనుక, విజ్ఞులను అడిగి కొద్దిగా జలపానం మాత్రం చేసాడు. అంతే దూర్వాసుల వారు వచ్చేసారు. అంబరీషుడు చేసిన పని పసిగట్టేసాడు. కోపం పెరిగిపోయింది. ఇంకేముంది, అప్పటికప్పుడు కృత్యను సృష్టించి అంబరీషుని మీదకు ప్రయోగించాడు. మరి విష్ణుపేనా ఊరుకుంటాడేమో గాని, సుదర్శనుడు ఊరుకుంటాడా. కృత్యను కాల్చేసి మహర్షి మీదకు విష్ణుచక్రం వెళ్ళసాగింది. ఈయన ఎంత దూరం పరుగెట్టినా ఏవరి శరణు కోరినా ఫలితం దక్కలేదు. ఆఖరికి రాజర్షినే వేడుకుంటాడు. ఆయన చక్రాయుధాన్నిప్రార్థించి మహర్షిని కాపాడతాడు. ఇదీ ఈ ఆఖ్యానము. ఆఖ్యానము అనగా పూర్వము జరిగిన వృత్తాంతము.

ఇంతటి మహాద్భుతమైన ఆఖ్యానాన్ని. మన భాగవత సాధనలో పదిహేనవ అంశముగా చేపడదాం రండి సహసాధకులారా. మా నల్లనయ్య అండ దండ మెండుగా మనందరికీ అందుతూ ఉండు గాక..

~ భాగవత గణనాధ్యాయి.

# అంబరీషాఖ్యానంబు

## ప్రార్థన

9-1-క. *

**శ్రీరాజిత! మునిపూజిత!**

**వారిధి గర్వాతిరేక వారణ బాణా!**

**సూరిత్రాణ! మహోజ్జ్వల**

**సారయశస్సాంద్ర! రామచంద్ర నరేంద్రా!**

టీక:- శ్రీరాజిత = రామా {శ్రీరాజితుడు - శ్రీ (లక్ష్మీదేవి)చేత రాజితుడు (ప్రకాశించెడి వాడు), రాముడు}; మునిపూజిత = రామా {ముని పూజితుడు - మునులచే పూజింపబడువాడు, రాముడు}; వారిధి గర్వాతిరేక వారణ బాణా = రామా {వారిధి గర్వాతిరేక వారణ బాణుడు - వారిధి (సముద్రుని) గర్వాతిరేక (గర్వాతిశయమును) వారణ (వారించిన) బాణుడు (బాణముగలవాడు), రాముడు}; సూరిత్రాణ = రామా {సూరిత్రాణుడు - సూరి (పండితులను) త్రాణుడు (కాపాడెడివాడు), రాముడు}; మహోజ్జ్వలసారయశస్సాంద్ర = రామా {మహోజ్జ్వల సారయశస్సాంద్రుడు - మహా (గొప్ప) ఉజ్జ్వల (ప్రకాశవంతమైన) సార (చేవ గలిగిన) యశస్ (కీర్తి) సాంద్రుడు (దట్టముగాగలవాడు), రాముడు}; రామచంద్ర నరేంద్రా = రామా {రామచంద్రనరేంద్రుడు - రాముడనెడి చంద్రునివంటివాడైన నరేంద్రుడు (రాజు), రాముడు}.

భావము:- లక్ష్మిగలిగి ప్రకాశించే వాడా! మునులు పూజించు వాడా! సముద్రుడి గర్వం సర్వం పోగొట్టిన బాణం గలవాడా! పండితులను కాపాడే వాడా! బహు ప్రకాశవంతమైన గొప్పకీర్తి గల వాడా! శ్రీరామచంద్ర ప్రభూ! అవధరించు.

## అంబరీషుని వృత్తాంతము

**9-80-వ.**

**అంత నాభాగునకు నంబరీషుండు జనియించె; నతని యందు జగ దప్రతిహతంబైన బ్రాహ్మణశాపంబు నిరర్థకం బయ్యె” ననిన విని “యేమి కారణంబున దురంతంబైన బ్రహ్మదండంబు వలన నతండు విడువం బడియె” ననిన నప్పుడమిఱేనికి శుకుం డిట్లనియె.**

టీక:- అంతస్ = ఆతరువాత; నాభాగుస్ = నాభాగుని; కుస్ = కి; అంబరీషుండు = అంబరీషుడు; జనియించెస్ = పుట్టెను; అతని = అతని; అందుస్ = ఎడల; జగత్ = లోకమున; అప్రతిహతంబు = తిరుగులేనిది; ఐన = అయినట్టి; బ్రాహ్మణ = బ్రాహ్మణుని; శాపంబుస్ = శాపముకూడ; నిరర్దకంబు = వ్యర్థమైనది; అయ్యెస్ = అయిపేయినది; అనినస్ = అనగా; విని = విని; ఏమి = ఎట్టి; కారణంబునస్ = కారణముచేత; దురంతంబు = దాటరానిది; ఐన = అయినట్టి; బ్రహ్మదండంబుస్ = బ్రహ్మశాపము; వలనస్ = నుండి; అతండు = అతడు; విడువంబడియెస్ = తప్పించుకొనబడెను; అనినస్ = అనగా; ఆ = ఆ; పుడమిఱేని = రాజున; కిస్ = కు; శుకుండు = శుకుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అటుపిమ్మట, నాభాగునికి అంబరీషుడు పుట్టాడు. బ్రాహ్మణ శాపం లోకంలో తిరుగులేనిది అంటారు. అంతటి శాపం కూడ అతని ఎడల వ్యర్థం అయిపోయింది.” అంటున్న శుకునితో పరీక్షిత్తు ఇలా అన్నాడు. “ఎందుచేత అంతటి దాటరాని బ్రహ్మణశాపం నుండి అతడు తప్పించుకొన గలిగాడు.” ఇలా అడిగిన ఆ రాజుతో శుకుడు ఇలా పలికాడు.

**9-81-శా.**

"సప్తద్వీప విశాలభూభరము దోః స్తంభంబునం బూని, సం
ప్రాప్తశ్రీయుతుఁడై, మహావిభవసంపచ్చాతురిం గల్గి, దు
ర్వ్యాప్తిం జెందక, వైష్ణవార్చనలమేరం గాలముం బుచ్చుచున్,
సుప్తిం బొందక, యొప్పె సద్గుణగరిష్ఠుం డంబరీషుం డిలన్.

టీక:- సప్తద్వీప = సప్తద్వీపములకూడిన {సప్తద్వీపములు - 1జంబూ 2ప్లక్ష 3శాల్మలీ 4కుశ 5క్రౌంచ 6శాక 7పుష్కర అనెడి ఏడు ద్వీపములు}; విశాల = విశాలమైన; భూ = భూమండల; భారమున్ = బాధ్యతను; దోః = భుజములు అనెడి; స్తంభంబునన్ = స్తంభములపైన; పూని = ధరించి; సంప్రాప్త = లభించిన; శ్రీయుతుండు = శుభములు గలవాడు; ఐ = అయ్యి; మహావిభవ = రాజభోగములు; సంపత్ = సంపదలు; చాతురిన్ = చాతుర్యము; కల్గి = పొంది; దుర్వ్యాప్తిన్ = చెడునడతను; చెందక = లోనుగాక; వైష్ణవ = హరి; అర్చనలన్ = పూజలందు; మేరన్ = మాత్రమే; కాలమున్ = సమయమంతను; పుచ్చుచున్ = గడుపుతూ; సుప్తిన్ = ఏమరుపాటును; పొందక = చెందకుండగ; ఒప్పెన్ = పేరుపొందెను; సద్గుణ = మంచిగుణములతో; గరిష్ఠుండు = గొప్పవాడు; అంబరీషుండు = అంబరీషుడు; ఇలన్ = ఈలోకమునందు.

భావము:- "మహాత్ముడు అంబరీషుడు సప్తద్వీప సమన్వితమైన విశాల భూమండల బాధ్యతను ధరించి, సకల శుభాలు అందుకుంటూ, చాతుర్యంతో సకల రాజభోగాలు, సంపదలు అనుభవిస్తూ, చెడు నడత లేకుండా, నిత్యం హరి పూజలతో గడుపుతూ, ఏమరుపాటు చెందకుండ రాజ్యపాలన చేస్తున్నాడు. కనుక అంబరీషుడు తన సద్గుణాలతో లోకప్రసిద్ధుడు అయ్యాడు.

9-82-సీ.

చిత్తంబు మధురిపు శ్రీపాదముల యంద-
పలుకులు హరిగుణపఠనమంద;
కరములు విష్ణుమందిర మార్జనములంద-
శ్రవములు హరికథాశ్రవణమంద;
చూపులు గోవింద రూపవీక్షణమంద-
శిరము కేశవ నమస్కృతుల యంద;
పదము లీశ్వరగేహపరిసర్పణములంద-
కామంబు చక్రికైంకర్యమంద;

**9-82.1-తే.**

సంగ మచ్యుతజన తనుసంగమంద;
ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమలమంద;
రసనఁ దులసీదళములంద; రతులు పుణ్య
సంగతుల యంద యా రాజచంద్రమునకు.

టీక:- చిత్తంబున్ = మనసు; మధురిపు = నారాయణుని {మధురిపుడు - మధుయనెడి రాక్షసుని శత్రువు, విష్ణువు}; శ్రీ = శుభకరమైన; పాదములన్ = పాదాల; అందన్ = మీదమాత్రమే; పలుకులు = మాటలు; హరి = నారాయణుని {హరి - భక్తుల హృదయములను ఆకర్షించువాడు, విష్ణువు}; గుణ = గుణము లను; పఠనము = సంకీర్తనములు; అంద = మీదమాత్రమే; కరములున్ = చేతులు; విష్ణు = నారాయణుని {విష్ణువు - విశ్వమున వ్యాపించువాడు, హరి}; మందిర = గుడి; మార్జనములు = శుభ్రపరచుట; అంద = మీదమాత్రమే; శ్రవములు = చెవులు; హరి = నారాయణుని; కథా = వృత్తాంతములను; శ్రవణము = వినుట; అంద = మీదమాత్రమే; చూపులు = చూపులు; గోవింద =

నారాయణుని {గోవిందుడు - గోవుల (ఆవుల, నీళ్ళు, జీవుల)కు ఒడయుడు, విష్ణువు}; రూప = స్వరూపములను; వీక్షణము = చూచుట; అంద = మీద మాత్రమే; శిరము = తల; కేశవ = నారాయణుని {కేశవుడు - కేశియనెడి రాక్షసిని చంపినవాడు, విష్ణువు}; నమస్కృతులు = తలవంచినమస్కరించుట; అంద = మీదమాత్రమే; పదములు = కాళ్ళు; ఈశ్వర = నారాయణుని; గేహస్ = గుడిలో; పరిస్ఫురణములు = చుట్టిరావడము; అంద = మీదమాత్రమే; కామంబుస్ = కోరికలు; చక్రి = నారాయణుని {చక్రి - చక్రము ఆయుధముగాగలవాడు, విష్ణువు}; కైంకర్యము = సేవించుటలు; అంద = మీదమాత్రమే.

సంగము = తగులము; అచ్యుత = నారాయణుని {అచ్యుతుడు – భ్రంశములేని వాడు, విష్ణువు}; జనత = అనుయాయుల; అనుసంగము = అనుసరించుట; అంద = మీదమాత్రమే; ఘ్రాణము = ముక్కు; అసురారి = నారాయణుని {అసురారి - అసురుల (రాక్షసుల) అరి (శత్రువు), విష్ణువు}; భక్త = భక్తుల; అంఘ్రి = పాదముల; అంద = మీదమాత్రమే; రసనస్ = నాలుక; తులసీదళములు = తులసీదళములు; అంద = మీదమాత్రమే; రతులు = అనురాగములు; పుణ్య = పుణ్యుని, నారాయణుని; సంగతుల = విషయములు; అంద = మీదమాత్రమే; ఆ = ఆ; రాజ = రాజులనెడి తారకలలో; చంద్రముస్ = చంద్రునివంటివాని; కుస్ = కి.

భావము:- అబరీషునికి సదా మనసు మధురిపు శుభకరమైన పాదాల మీద మాత్రమే; మాటలు హరి గుణములను సంకీర్తనములు మీద మాత్రమే; చేతులు వైష్ణవాలయాలను శుభ్రపరచుట మీద మాత్రమే; చెవులు విష్ణుకథలు వినుట మీద మాత్రమే; చూపులు గోవిందుని రూపాలను దర్శించుట మీద మాత్రమే; తల కేశవునికి తలవంచి నమస్కరించుట మీద మాత్రమే; కాళ్ళు నారాయణుని గుడిలో ప్రదక్షిణలు మీద మాత్రమే; కోరికలు చక్రిసేవలు మీద మాత్రమే; హరిభక్తులతో మాత్రమే సాంగత్యం; వాసన చూసేది విష్ణుభక్తుల పాదపద్మాలను మాత్రమే; రుచి తులసీదళాలమీద మాత్రమే; పుణ్యవిషయాలపై మాత్రమే ఆసక్తి ఆ మహారాజుకు.

9-83-వ.

మఱియు నమ్మహీవిభుండు.

టీక:- మఱియున్ = ఇంకను; ఆ = ఆ; మహీవిభుండు = రాజు {మహీవిభుడు - మహి (భూమి)కి విభుడు(ప్రభువు), రాజు}.

భావము:- అంతేకాక ఆ మహారాజు.....

9-84-సీ.

ఘన వైభవంబునఁ గల్మషదూరుఁడై-

యజ్ఞేశు, నీశు, నబ్జాక్షుఁ గూర్చి,

మొనసి వసిష్ఠాది మునివల్లభులతోడఁ-

దగిలి, సరస్వతీ తటమునందు

మేధతో బహువాజిమేథంబు లొనరించె-

గణుతింపరాని దక్షిణలు బెట్టి;

సమలోష్టహేముఁడై, సర్వకర్మంబులు-

హరిపరంబులు గాఁగ నవని యేలె;

9-84.1-ఆ.

విష్ణుభక్తులందు, విష్ణువునందుఁ, గ

లంక యెడల, మనసు లంకె పెట్టి,

విహితరాజ్యవృత్తి విడువనివాఁడునై,

యతఁడు రాచతపసి యనఁగ నొప్పె.

టీక:- ఘన = గొప్ప; వైభవంబునన్ = వైభవముతో; కల్మష = పాపములకు; దూరుడు = దూరముగనున్నవాడు; ఐ = అయ్యి; యజ్ఞేశున్ = నారాయణుని

{యజ్ఞేశుడు - యజ్ఞములకు అధిపతి, విష్ణువు}; ఈశుస్ = నారాయణుని; అబ్జాక్షుస్ = నారాయణుని {అబ్జాక్షుడు - పద్మములవంటి కన్నులు గలవాడు, విష్ణువు}; కూర్చి = గురించి; మొనసి = పూని; వసిష్ఠ = విసిష్ఠుడు; ఆది = మున్నగు; ముని = మునులలో; వల్లభులు = శ్రేష్ఠుల; తోడస్ = తోటి; తగిలి = చేరి; సరస్వతీ = సరస్వతీనదియొక్క; తటముస్ = ఒడ్డు; అందుస్ = పైన; మేధ = చుఱుకైనబుద్ధి {మేధ - చురుకుదనముగల బుద్ధి (జ్ఞాపకశక్తి కలదికానిది)}; తోస్ = తోటి; బహు = అనేకమైన; వాజిమేధంబులు = అశ్వమేధయాగములు; ఒనరించె = చేసెను; గణుతింప = లెక్కపెట్టుటకు; రాని = సాధ్యముకానన్ని; దక్షిణలు = దక్షిణలు; పెట్టి = ఇచ్చి; సమలోష్టహేముఁడు = సమదృష్టికలవాడు {సమలోష్టహేముడు -సమ (సమదృష్టి) లోష్ట (మట్టిపెళ్ళలు) హేమ (బంగారము) లందు గలవాడు, సమదృష్టిగలవాడు}; ఐ = అయ్యి; సర్వ = సమస్తమైన; కర్మంబులుస్ = కర్మలను; హరి = నారాయణుని; పరంబులు = సమర్పించినది; కాగస్ = అయినట్లు; అవనిస్ = భూమండలమును; ఏలెస్ = పరిపాలించెను.

విష్ణు = హరి; భక్తులు = భక్తులు; అందుస్ = ఎడల; విష్ణువుస్ = హరి; అందుస్ = ఎడల; కలంక = గురి; ఎడల = అతిశయించగ; మనసు = మనసును; లంకె = లగ్నము; పెట్టి = చేసి; విహిత = నియమించబడిన; రాజ్య = రాజ్యపాలన; వృత్తిస్ = ధర్మమును; విడువని = వదలివేయని; వాడుస్ = వాడు; ఐ = అయ్యి; అతడు = అతడు; రాచతపసి = రాజర్షి; అనగస్ = అనుటకు; ఒప్పెస్ = తగియుండెను.

భావము:- ఆ అంబరీషుడు గొప్ప వైభవంతో కల్మషాలకు దూరంగా ఉండేవాడు. యజ్ఞేశుని, నారాయణుని, అబ్జాక్షుని గురించి వసిష్ఠాది మహామునులతో చేరి సరస్వతీనది ఒడ్డున లెక్కపెట్టలేనన్ని దక్షిణలు ఇచ్చి అనేక అశ్వమేథ యాగాలు చేసాడు. సమదృష్టికలవాడు సర్వ కర్మలను నారాయణ పరంగా ఆచరిస్తూ రాజ్య పరిపాలన సాగించాడు. విష్ణు భక్తులు ఎడల, హరి ఎడల చక్కటి

గురి కలిగి ఉండి రాజ్యపాలన ధర్మాన్ని; విడువక చేసేవాడు. కనుక, ఆయన రాజర్షి అనుటకు తగినవాడు.

9-85-వ.

**వెండియు నమ్మహాభాగవతుండు**

టీక:-వెండియు = ఇంకను; ఆ; మహా = గొప్ప; భాగవతుండు = భాగవతుడు.

భావము:- ఇంకా ఆ మహా భాగవతుడు......

9-86-క.

**హరి! యని సంభావించును;**
**హరి! యని దర్శించు; నంటు; నాఘ్రాణించున్;**
**హరి! యని రుచిగొనఁ దలఁచును;**
**హరిహరి; ఘను నంబరీషు నలవియె పొగడన్?**

టీక:- హరి = నారాయణుడు; అని = అనుచు; సంభావించును = పలకరించును; హరి = మాధవ; అని = అనుచు; దర్శించునున్ = చూచును; అంటున్ = తాకును; ఆఘ్రాణించును = వాసనచూచును; హరి = గోవింద; అని = అనుచు; రుచిగొన దలచును = రుచిచూచును; హరిహరి = ఆహా; ఘనున్ = గొప్పవాడు; అంబరీషున్ = అంబరీషును; అలవియె = సాధ్యమా, కాదు; పొగడన్ = కొనియాడుట.

భావము:- హరి అనుచు పలకరిస్తాడు. మాధవ అనుచు చూస్తాడు. తాకుతాడు, ఆఘ్రాణిస్తాడు. గోవింద అనుచు రుచి చూస్తాడు. ఆహా ఆ మహాత్ముడు అంబరీషుని కొనియాడుట ఎంతటివారికైనా సాధ్యం కాదు.......

9-87-వ.

**ఇట్లు పుణ్యచిత్తుండు, నీశ్వరాయత్తుండునై యల్లనల్లన రాజ్యంబు చేయుచున్న సమయంబున.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; పుణ్యచిత్తుండు = పుణ్యాత్ముడు; ఈశ్వర = నారాయణుని; ఆయత్తుండుస్ = లగ్నమైనచిత్తంగలవాడు; ఐ = అయ్యి; అల్లనల్లన = అనాయాసముగ; రాజ్యంబుస్ = రాజ్యపాలన; చేయుచున్న = చేస్తున్న; సమయంబున = సమయమునందు.

భావము:- ఈ మాదిరిగా పుణ్యాత్ముడు; నారాయణుని యందు లగ్నమైన చిత్తం గలవాడు; అంబరీషుడు అనాయాసముగ రాజ్యం పాలిస్తున్న సమయంలో.

9-88-ఆ.

**అతని కీహ మానె హరులందుఁ గరులందు**
**ధనములందుఁ గేళివనములందుఁ**
**బుత్రులందు బంధుమిత్రుల యందును**
**బురమునందు నంతిపురమునందు.**

టీక:- అతని = అతని; కిస్ = కి; ఈహ = ఆసక్తి; మానెస్ = ఉడిగిపోయినది; హరులు = గుఱ్ఱముల; అందుస్ = ఎడల; కరులు = ఏనుగుల; అందుస్ = ఎడల; ధనములు = సంపదల; అందుస్ = ఎడల; కేళీవనములు = ఉద్యానవనముల; అందుస్ = ఎడల; పుత్రులు = కొడుకుల; అందుస్ = ఎడల; బంధు = బంధువులు; మిత్రుల = స్నేహితులు; అందునుస్ = ఎడల; పురము = రాజధాని; అందుస్ = ఎడల; అంతిపురము = స్త్రీసౌఖ్యములు; అందు = ఎడల;

భావము:- అతనికి భార్యా బిడ్డలపైన; ధనధాన్యాలపైన; రాజ్యం పైన; గుఱ్ఱాలు, ఏనుగులు, కేళీవనములు, బంధుమిత్రులు, పుర అంతిపురాలు పైన ఆసక్తి ఉడిగిపోయినది.

9-89-వ.

**అంతఁ గొంతకాలంబున కమ్మేదినీకాంతుండు సంసారంబువలని**
**తగు లంబు విడిచి నిర్మలుండై యేకాంతంబున భక్తిపరవశుండై**
**యుండ నా రాచతపసికి భక్తలోకవత్సలుండగు పురుషోత్తముండు**
**ప్రతిభటశిక్షణం బును, నిజజనరక్షణంబును, నిఖిలజగదవక్రంబును**
**నగు చక్రంబు నిచ్చి చనియె; అంత.**

టీక:- అంతస్ = అప్పుడు; కొంతకాలంబుస్ = కొన్నాళ్ళ; కుస్ = కు; ఆ = ఆ; మేదినీకాంతుండు = రాజు {మేదినీకాంతుడు - మేదిని (భూమి)కి కాంతుడు (భర్త), రాజు}; సంసారంబుస్ = సంసారము; వలని = అందు; తగులంబు = మోహమును; విడిచి = వదలిపెట్టి; నిర్మలుండు = పరిశుద్ధుడు; ఐ = అయ్యి; ఏకాంతంబునస్ = అనన్యముగ; భక్తి = భక్తివలన; పరవశుండు = మేనుమరచిన వాడు; ఐ = అయ్యి; ఉండస్ = ఉండగా; ఆ = ఆ; రాచతపస్ = రాజర్షి; కిస్ = కి; భక్త = భక్తులు; లోక = అందరకు; వత్సలుండు = వాత్సల్యముగలవాడు; అగు = ఐన; పురుషోత్తముండు = నారాయణుడు; ప్రతి = శత్రు; భట = వీరులను; శిక్షణంబునుస్ = శిక్షించెడిది; నిజ = తన; జన = వారిని; రక్షణంబును = కాపాడెడిది; నిఖిల = సమస్తమైన; జగత్ = లోకములందు; అవక్రంబునుస్ = అడ్డులేనిది; అగు = ఐన; చక్రంబుస్ = (సుదర్శన) చక్రమును; ఇచ్చి = ఇచ్చి; చనియె = వెళ్ళెను; అంతస్ = అంతట.

భావము:- అప్పుడు, కొన్నాళ్ళకు ఆ మహారాజు సంసారంపై మోహము విడిచిపెట్టి నిర్మలుడు ఏకాంతభక్తి పరవశుడు అయ్యి ఉండగా, ఆ రాజర్షికి; భక్తవత్సలుడైన నారాయణుడు శత్రు వీరులను శిక్షించెడిది, తనవారిని కాపాడెడిది; నిఖిల లోకము లందు అడ్డులేనిది ఐన సుదర్శన చక్రమును అనుగ్రహించాడు. అంతట.....

**9-90-క.**

**తన తోడినీడ క్రైవడి**

**ననురూప గుణాఢ్య యైన యాత్మమహిషితో**

**జనవిభుఁడు ద్వాదశీవ్రత**

**మొనరస్ హరిఁగూర్చి చేసె నొక యేఁ డధిపా!**

టీక:- తన = తన; తోడి = తోపాటు; నీడ = నీడ; క్రైవడి = వలె; అనురూప = అనుకూలవిధమైన; గుణ = సుగుణములతో; ఆఢ్య = సంపన్నురాలు; ఐన = అయి నట్టి; ఆత్మ = పట్టపు; మహిషి = రాణి; తోస్ = తోటి; జనవిభుడు = రాజు {జనవిభుడు - జనులకు ప్రభువు, రాజు}; ద్వాదశీవ్రతమున్ = ద్వాదశీవ్రతమును {ద్వాదశీవ్రతము -ప్రతి ఏకాదశినాడు ఉపవాసముండి కార్తీక శుక్ల ద్వాదశి గడియలలో పారణము ఉద్వాసన చేసెడి వ్రతము}; ఒనరస్ = చక్కగా; హరిస్ = నారాయణుని; గూర్చి = ఉద్దేశించి; చేసెస్ = ఆచరించెను; ఒక = ఒకానొక; ఏడు = సంవత్సరము; అధిపా = రాజా.

భావము:- రాజా! తనకు తోడునీడలా అనుకూలమైన వర్తనతో ఉండే సుగుణ సంపన్నురాలు ఐన పట్టపురాణి తాను కలిసి ఆ అంబరీష మహారాజు నారాయణుని గురించి ద్వాదశీవ్రతం ఆచరిస్తున్నాడు. అంతట ఒక ఏడు.....

9-91-వ.

**ఇట్లు వ్రతంబుచేసి, యా వ్రతాంతంబునం గార్తికమాసంబున మూఁడు రాత్రు లుపవసించి, కాళిందీజలంబుల స్నాతుండయి, మధువనం బున మహాభిషేక విధానంబున విహిత పరికర సుసంపన్నుం డయి, హరి నభిషేకంబు జేసి, మనోహరంబు లయిన గంధాక్షతంబులు సమర్పించి యభినవామోదంబులైన పుష్పంబులం బూజించి తదనంతరంబ.**

టీక:- ఇట్లు = ఇలా; వ్రతంబున్ = వ్రతమును; చేసి = ఆచరించి; ఆ = ఆ; వ్రత = వ్రతముయొక్క; అంతం = పూర్తిఅయినప్పుడు; కార్తిక = కార్తీక; మాసంబునన్ = నెలలో; మూఁడు = మూడు (3); రాత్రులు = రోజులురాత్రులందు; ఉపవసించి = నిరాహారముగనుండి; కాళిందీ= యమునానదిలోని; జలంబులన్= నీటిలో; స్నాతుండు = స్నానముచేసినవాడు; అయి = అయ్యి; మధు = మధు యనెడి; వనం బునన్ = తోటలో; మహాభిషేక = మహాభిషేకపు; విధానంబునన్ = పద్దతితో; విహిత = అవసరమైన; పరికర = సాధనములు; సుసంపన్నుండు = పుష్కలముగాగలవాడు; అయి = అయ్యి; హరిన్ = హరిప్రతిమకు; అభిషేకంబున్ = అభిషేకము; చేసి = ఆచరించి; మనోహరంబులు = చక్కటివి; అయిన = ఐన; గంధ = గంధములు; అక్షతం బులన్ = అక్షింతలు; సమర్పించి = నివేదించి; అభినవ = సరికొత్త; ఆమోదంబులు = సువాసనులుగలవి; ఐన = అయినట్టి; పుష్పంబులన్ = పూలతో; పూజించి = పూజచేసి; తదనంతరంబ = ఆతరువాత.

భావము:- ఇలా కార్తిక మాసంలో వ్రతము ఆచరించి ఆ వ్రతాంతమున మూడు రాత్రులు ఉపవాసం ఉన్నాడు. పిమ్మట యమునానది నీటిలో స్నానము చేసాడు. మధువనంలో మహాభిషేకానికి కావలసిన పరికరాలు అన్నీ పుష్కలంగా సమకూర్చుకున్నాడు. హరిప్రతిమకు అభిషేకం చేసి మనోహరములైన గంధాక్షత

లను సమర్పించాడు. సువాసనా భరితాలైన నవనవలాడే పూలతో పూజించి, తరువాత....

9-92-శా.

పాలేఱ్ఱై ప్రవహింప నంగరుచులం బ్రాయంబులుస్ రూపము
ల్మేలై ధూర్తులుగాక వెండిగొరిజల్హేమోరు శృంగంబులుం
గ్రాలం గ్రేపుల యట్టు నాఁకుచును రంగచ్చేలలై యున్న మం
దాలస్ న్యర్బుదషట్క మిచ్చె విభుఁ డుద్యద్వైదికశ్రేణికిస్

టీక:- పాలు = క్షీరములు; ఏఱ్ఱై = కాలువలుగట్టి; ప్రవహింపస్ = పారెడివు; అంగ = శరీరములు; రుచులుస్ = కాంతులుగలవి; ప్రాయంబులుస్ = మంచి వయసులోనున్నవి; రూపములు = స్వరూపములు; మేలు = మంచిగానున్నవి; ఐ = అయ్యి; ధూర్తులు = పొగరుమోతువి; కాక = కానివి; వెండి = వెండితొడుగులు గల; గొరిజలుస్ = కాలిగిట్టలు; హేమ = బంగారుకుప్పెలుగల; ఉరు = పెద్ద; శృంగంబులుస్ = కొమ్ములుతో; క్రాలస్ = విలసిల్లుతుండగా; క్రేపులస్ = దూడల; అట్టు = మెడవంపును; నాకుచునుస్ = నాకుతూ; రంగత్ = మెరుస్తున్న; చేలలు = వస్త్రములుగలవి; ఐ = అయ్యి; ఉన్న = ఉన్నట్టి; మందాలస్ = పాడి పశువులను; న్యర్బుదషట్కము = ఆరువందలకోట్లు; ఇచ్చెస్ = దానముచేసెను; విభుడు = రాజు; ఉద్యత్ = మిక్కిలి; వైదిక = వేదజ్ఞానముగలవిప్రుల; శ్రేణి = సమూహము; కిస్ = కి.

భావము:- రాజు అంబరీషుడు వేదపండితులకు; పాలు సమృద్ధిగా ఇచ్చేవి, చక్కటి శరీర కాంతులు గలవి, మంచి ప్రాయం స్వరూపం కలవి, పొగరుమోతువి కానివి, వెండి తొడుగులు గల కాలిగిట్టలు, బంగారు కుప్పెలు గల పెద్ద కొమ్ములుతో విలసిల్లేవి, దూడల అట్టులు నాకుతూ ఉన్నవి, తళతళలాడే వస్త్రాలు అలంకరించి నవి అయిన పాడిపశువులను ఆరువందలకోట్లు దానం చేసాడు.

9-93-క.

పెక్కండ్రు విప్రవరులకు

గ్రక్కున నతిభక్తితోడఁ గడుపులు నిండం

జొక్కపు టన్నంబిడి విభుఁ

డొక్కెడఁ బారణము చేయ నుద్యోగింపన్.

టీక:- పెక్కండ్రు = అనేకమంది; విప్ర = బ్రహ్మణ; వరులు = శ్రేష్ఠుల; కున్ = కు; గ్రక్కునన్ = శ్రీఘ్రముగా; అతి = మిక్కిలి; భక్తి = శ్రద్ధ; తోడన్ = తోటి; కడుపులు = కడుపులు; నిండన్ = నిండేటట్లుగ; చొక్కపు = చక్కటి; అన్నంబున్ = భోజనము; ఇడి = పెట్టి; విభుడు = రాజు; ఒక్క = ఒక; ఎడన్ = సమయమున; పారణమున్ = ఉపవాసానంతరభాజనము; చేయన్ = చేయుటకు; ఉద్యోగింపన్ = సిద్ధపడుతుండగ.

భావము:- ఆ మహారాజు ఎందరో బ్రహ్మణవరులకు మిక్కిలి భక్తిశ్రద్ధలతో కడుపులు నిండా చక్కటి భోజనము పెట్టి, ఏకాదశ వ్రతాంతంలో ఉపవాసానంతరం భుజించే ద్వాదశీపారణ చేయడానికి సిద్ధపడుతుండగ......

9-94-వ.

అయ్యవసరంబున.

టీక:- ఆ = ఆ; అవసరంబునన్ = సమయమున.

భావము:- అలా అంబరీషుడు ద్వాదశీపారణకు సిద్ధం అవుతున్న సమయంలో.

9-95-క.

భాసుర నిగమ పదోప

న్యాసుఁడు సుతపోవిలాసుఁ డనుపమ యోగా

భ్యాసుఁడు రవిభాసుఁడు దు
ర్వాసుఁ డతిథి యయ్యెఁ దన్నివాసంబునకున్.

టీక:- భాసుర = ప్రసిద్ధముగ; నిగమ = వేద; పద = మార్గమునందు; ఉపన్యాసుడు = ఉండువాడు; సు = మంచి; తపస్ = తపశ్శక్తితో; విలాసుడుస్ = విలసిల్లెడివాడు; అనుపమ = సాటిలేని; యోగ = యోగమును; అభ్యాసుడు = అభ్యాసమున నిపుణుడు; రవి = సూర్యునివంటి; భాసుడు = ప్రకాశించువాడు; దుర్వాసుడు = దుర్వాసుడు; అతిథి = అతిథిగా; అయ్యెస్ = వచ్చెను; తత్ = అతని; నివాసంబుస్ = ఇంటి; కిన్ = కి.

భావము:- ఆ అంబరీషుని గృహానికి; ప్రసిద్ధ వేదవేత్త, మహా తపశ్శాలి, అనుపమ యోగాభ్యాస నిపుణుడు, సూర్య సమ ప్రకాశి అయిన దుర్వాసమహర్షి అతిథిగా వచ్చాడు.

9-96-వ.

అట్లతిథి యై వచ్చిన నమ్మునివల్లభునకుఁ బ్రత్యుత్థానంబు చేసి, కూర్చుండ గద్దియ యిడి పాదంబులు గడిగి పూజించి క్షేమం బరసి తన యింట నన్నంబు గుడువు మని నమస్కరించిన నమ్మహా త్ముండు సంతసించి భోజనంబునకు నంగీకరించి, నిర్మలంబులగు కాళిందీజలం బులం బరమధ్యానంబు చేయుచు, మునింగి లేచి రాక తడవు చేసిన, ముహూర్తార్ధావశిష్ట యగు ద్వాదశి యందుఁ బారణ చేయవలయుటఁ జింతించి బ్రాహ్మణాతిక్రమదోషంబునకు శంకించి విద్వజ్జనంబుల రావించి వారల నుద్దేశించి.

టీక:- అట్లు = అలా; అతిథి = అతిథి; ఐ = కాగ; వచ్చినన్ = రాగా; ఆ = ఆ; ముని = మునులలో; వల్లభున్ = ప్రభువు; కున్ = కి; ప్రత్యుత్థానంబున్ = లేచి ఎదురువెళ్ళుట; చేసి = చేసి; కూర్చుండన్ = కూర్చొనుటకు; గద్దియ = ఉన్నతాసనము; ఇడి = ఇచ్చి; పాదంబులన్ = కాళ్ళు; కడిగి = నీటితోశుభ్రపరచి; పూజించి = పూజచేసి; క్షేమంబున్ = కుశలప్రశ్నలు; అరసి = అడిగి; తన = తనయొక్క; ఇంటన్ = నివాసమునందు; అన్నంబున్ = భోజనము; కుడువుము = తినుము; అని = అని; నమస్కరించినన్ = ప్రార్థించగా; ఆ = ఆ; మహాత్ముండు = గొప్పవాడు; సంతసించి = సంతోషించి; భోజనంబున్ = అన్నముతినుట; కున్ = కు; అంగీకరించి = ఒప్పుకొని; నిర్మలంబు = స్వచ్ఛమైనవి; అగు = ఐన; కాళిందీ = కాళిందిమడుగు; జలంబులన్ = నీటిలో; పరమ = అధికమైన; ధ్యానంబున్ = ధ్యానము; చేయుచున్ = చేస్తూ; మునింగి = స్నానముచేయుచు; లేచిరాక = బయటకురాకుండగ; తడవు = ఆలస్యము; చేసినన్ = చేయగా; ముహూర్త = ముహూర్తకాలములో; అర్థ = సగముమాత్రమే; అవశిష్ఠ = మిగిలినది; అగు = అయినట్టి; ద్వాదశి = ద్వాదశితిథి; అందున్ = సమయములోనే; పారణ = పారణ; చేయవలయుటన్ = చేయవలసియుండుటను; చింతించి = ఆలోచించుకొని; బ్రాహ్మణ = బ్రాహ్మణుల; అతిక్రమ = అలక్ష్యముచేసిన; దోషంబున్ = తప్పున; కున్ = కు; శంకించి = అనుమానపడి; విద్వత్ = జ్ఞానులైన; జనంబులన్ = వారిని; రావించి = పిలిపించి; వారలన్ = వారి; ఉద్దేశించి = తోటి.

భావము:- అలా అతిథిగ వచ్చిన దూర్వాస మునివరునికి ఎదురువెళ్ళి ఉన్నతాసనంపై ఆసీనుని చేసి, కాళ్ళు కడిగి, పూజించాడు. కుశలప్రశ్నలు అడిగి తన ఇంట భోజనం చేయమని ప్రార్థించాడు. ఆ మహాత్ముడు సంతోషించి, అంగీకరించాడు. స్నానం చేసి వస్తాను అని, నిర్మల కాళిందీ జలంలో ధ్యాన స్నానాలు చేస్తూ ఉండగా చాలా ఆలస్యం అవుతోంది. పైగా ద్వాదశి ఘడియలు కొద్దిసేపటిలో గడచిపోతాయి. ద్వాదశితిథి ఉండగానే పారణ చేయాలి. అందుచేత,

అటు పారణ చేస్తే బ్రాహ్మణ అతిక్రమణ దోషం, ఇటు పారణ చేయకపోతే ఏకాదశ వ్రత భంగం ఎలాగ అని శంకించి, సలహా కోసం విద్వజ్జనులను పిలిపించి

9-97-క.

"ముని నీరు జొచ్చి వెడలడు

చనియెడు ద్వాదశియు నింత చనియెన్నీలో

నన పారణయుస్ వలయును

వినిపింపుం డర్హధర్మవిధ మెట్టిదియో?"

టీక:- ముని = ఋషి; నీరు = నీటిలోనికి; చొచ్చి = స్నానమునకువెళ్ళి; వెడలడు = బయటకురాడు; చనియెడుస్ = వెళ్ళిపోవుచున్నది; ద్వాదశియుస్ = ద్వాదశితిథి; ఇంతస్ = ఇంతసమయము; చనియెస్ = అయిపోయినది; ఈలోనస్ = ఈలోపల; పారణయుస్ = ఆహారముగ్రహించుట; వలయును = చేయవలెను; వినిపింపుండు = చెప్పండి; అర్హ = తగిన; ధర్మ = ధర్మమైన; విధము = చేయ వలసినది; ఎట్టిదియో = ఎలానో.

భావము:- “దూర్వాస మహర్షి స్నానమునకు వెళ్ళి ఇంకా రావడం లేదు, కొద్ది సమయంలోనే ద్వాదశితిథి వెళ్ళిపోతోంది ఈ లోపల ఆహారము గ్రహించాలి కదా. ఇప్పుడు నేను ఏం చేయాలో తగిన ధర్మం నిర్ణయించి చెప్పండి.”

9-98-వ.

అని పలికిన నా రాజునకు బ్రాహ్మణజను లిట్లనిరి.

టీక:- అని = అని; పలికినస్ = అడుగగా; ఆ = ఆ; రాజుస్ = రాజున; కుస్ = కు; బ్రాహ్మణ = విప్రుల; జనులు = సమూహము; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:- అని అంబరీషుడు అడిగాడు. ఆ బ్రాహ్మణులు ఇలా పలికారు.

9-99-ఆ. *

"అతిథి పోయిరామి నధిప! యీ ద్వాదశి
పారణంబు మానఁ బాడి గాదు
గుడువకుంట గాదు కుడుచుటయును గాదు
సలిలభక్షణంబు సమ్మతంబు."

టీక:- అతిథి = భోజనార్థమువచ్చినవాడు; పోయి = వెళ్ళి; రామిన్ = రాకపోవుటచేత; అధిప = రాజా; ఈ = ఈ; ద్వాదశి = ద్వాదశిగడియలలోనే; పారణంబు = తినుట; మానన్ = మానివేయుట; పాడి = ధర్మము; కాదు = కాదు; కుడువకుంటన్ = తినకుండుట; కాదు = కాదు; కుడుచుటయును = తినుట; కాదు = కాదు; సలిల = మంచినీరు; భక్షణంబు = తీసుకొనుట; సమ్మతంబు = అంగీకారయోగ్యమైనది.

భావము:- “వెళ్ళిన అతిథి రాకపోతే ద్వాదశి పారణ మానడం ధర్మం గాదు. నీళ్ళు తాగితే భోజనం చేసినట్టు కాదు. చేయనట్టు కాదు. అందుచేత నీళ్ళు తాగడం ధర్మసమ్మతమే.”

## దూర్వాసుని కృత్య కథ

9-100-వ.

అని ధర్మసందేహంబు పాపిన, నా రాజర్షిశ్రేష్ఠుండును మనంబున హరిం దలంచి నీరు పారణంబు చేసి, జలంబుల మునింగిన తపసి రాక కెదురు చూచుచున్న సమయంబున.

టీక:- అని = అని; ధర్మసందేహంబున్ = ఏది ధర్మము అనెడి శంక; పాపినన్ = పోగొట్టగా; ఆ = ఆ; రాజర్షి = రాజుగానున్న ఋషులలో; శ్రేష్ఠుండును =

ఉత్తముడును; మనంబునస్ = మనసునందు; హరిస్ = నారాయణుని; తలంచి = ధ్యానించి; నీరుస్ = నీటిని; పారణంబు = పారణము; చేసి = చేసి; జలంబులస్ = నీటిలో; మునింగిన = స్నానమునకెళ్ళిన; తపసి = ఋషి; రాక = తిరిగి వచ్చుట; కుస్ = కు; ఎదురుచూచుచున్న = ప్రతీక్షించుచున్న; సమయంబున = సమయమునందు.

భావము:- అలా బ్రాహ్మణులు సందేహం తీర్చారు. అంబరీషుడు మనసులో విష్ణుమూర్తిని తలచుకుని కొద్దిగా నీళ్ళు తాగి, దూర్వాస మహర్షి రాక కోసం ఎదురు చూస్తున్నాడు. అప్పుడు....

**9-101-సీ.**

యమునలోఁ గృతకృత్యుఁడై వచ్చి రాజుచే-
సేవితుండై రాజుచేష్టితంబు
బుద్ధిలో నూహించి బొమముడి మొగముతో-
నదరెడి మేనితో నాగ్రహించి
రెట్టించి యాఁకలి గొట్టుమిట్టాడంగ-
"నీ సంపదున్మత్తు నీ నృశంసు
నీ దురహంకారు నిందఱుఁ గంటిరే?-
విష్ణుభక్తుఁడు గాడు వీఁడు; నన్నుఁ

**9-101.1-తే.**

గుడువ రమ్మని మునుముట్టఁ గుడిచినాఁడు
ధర్మభంగంబు చేసి దుష్కర్ముఁ డయ్యెఁ;

నయిన నిప్పుడు చూపెద నన్ని దిశల
నేను గోపింప మాన్పువాఁ డెవ్వఁ?" డనుచు.

టీక:- యమునస్ = యమునానది; లోస్ = అందు; కృతకృత్యుండు = పనిపూర్తిచేసుకొన్నవాడు; ఐ = అయ్యి; వచ్చి = తిరిగివచ్చి; రాజు = రాజు; చేస్ = చేత; సేవితుండు = మర్యాదలుపొందినవాడు; ఐ = అయ్యి; రాజు = రాజు; చేష్టితంబుస్ = చేసినపనిని; బుద్ధి = మనసు; అందుస్ = లో; ఊహించి = ఊహించి; బొమముడి = కనుబొములుముడిచిన; మొగము = ముఖము; తోస్ = తో; అదిరెడి = కంపించెడి; మేని = దేహము; తోస్ = తోటి; ఆగ్రహించి = కోపించి; రెట్టించి = (స్వరము) పెంచుతూ; ఆకలిస్ = ఆకలితో; కొట్టుమిట్టాడంగ = కరకరలాడుతుండ; ఈ = ఈ; సంపత్ = అధికమైనసంపదవలన; ఉన్మత్తునిస్ = పిచ్చిపట్టినవానిని; ఈ = ఈ; నృశంసుస్ = రాజును; ఈ = ఈ; దురహంకారుని = చెడ్డఅహంకారముగలవాని; ఇందఱుస్ = అంతమంది; కంటిరే = చూసారా; విష్ణు = నారాయణునికి; భక్తుడు = భక్తుడు; కాడు = కాడు; వీడు = ఇతను; నన్నుస్ = నన్ను; కుడువస్ = భోజనముచేయుటకు.

రమ్మని = పిలిచి; మునుముట్ట = ముందుగానే; కుడిచినాడు = భుజించినాడు; ధర్మ = ధర్మమునకు; భంగంబుస్ = విరుద్ధముగ; చేసి = చేసి; దుష్కర్ముడు = పాపి; అయ్యెస్ = అయిపోయినాడు; అయినస్ = అందుచేత; ఇప్పుడు = ఇప్పుడు; చూపెదస్ = నిరూపించెదను; అన్ని = సర్వ; దిశలస్ = దిక్కులందు; నేను = నేను; కోపింపస్ = కోపగించినచో; మాన్పువాడు = ఆపగలవాడు; ఎవ్వడు = ఎవడున్నాడు, లేడు; అనుచుస్ = అంటూ.

భావము:- యమునానదికి వెళ్ళిన దూర్వాసుడు స్నానాదులు ముగించుకుని తిరిగి వచ్చాడు. రాజు చేసిన మర్యాదలు స్వీకరించి, రాజు నీరు త్రాగుట మనసున ఊహించాడు. కరకరలాడుతున్న ఆకలికి తోడుగా మునికి మిక్కిలి

కోపం వచ్చింది. కనుబొమలు ముడిపడ్డాయి, దేహం కంపిస్తోంది. అప్పుడు ముని అమిత ఆగ్రహంతో బిగ్గరగా ఇలా అన్నాడు. "ఈ రాజును చూడండి, మితిమీరిన సంపదలతో పిచ్చిపట్టింది. బహు చెడ్డ అహంకారి తప్ప ఇతడు అచ్చమైన హరిభక్తుడు కాడు. నన్ను భోజనానికి పిలిచి, ముందుగా తాను భుజించాడు. ధర్మం తప్పి పాపి అయ్యాడు. నేను కోపగిస్తే ఎక్కడా ఎవడు ఆప లేడని, ఇప్పుడు నిరూపిస్తాను చూడండి." అంటూ....

9-102-చ.

**పెటపెటఁ బండ్లు గీఁటుచును భీకరుఁడై కనుఁ గ్రేవ నిప్పుకల్**
**పొటపొటరాల గండములుపొంగ మునీంద్రుఁడు హుంకరించుచున్**
**జట మొదలంటఁగాఁ బెటికి చక్కన దానన కృత్య నాయుధో**
**త్కట వరశూల హస్తయుతఁగా నొనరించి కవించె రాజుపైన్.**

టీక:- పెటపెట = పటపటమని; పండ్లు = పళ్ళు; గీటుచున్ = కొరుకుతూ; భీకరుడు = భయముగొల్పువాడు; ఐ = అయ్యి; కను = కళ్ళ; గ్రేవన్ = కొనలనుండి; నిప్పుకల్ = నిప్పుకణములు; పొటపొట = చిటపటమని; రాలన్ = రాలుతుండగ; గండములున్ = చెంపలు; ఉప్పొంగ = ఉబ్బునట్లు; ముని = మునులలో; ఇంద్రుండు = ఇంద్రునివంటి వాడు; హుంకరించుచున్ = హుంకారముచేయుచు; జట = సిగలోని జటను; మొదలం టన్ = సమూలముగ; పెటికి = పీకి; చక్కన = చక్కగ; దానన = దానితోనే; కృత్యన్ = పిశాచమును {కృత్య - సంహారమునకై చేయబడినది}; ఆయుధ = ఆయుధముండు టచే; ఉత్కట = మదించినది; వర = శ్రేష్ఠమైన; శూల = శూలమును; హస్త = చేతిలో; యుతన్ = ధరించినదిగ; ఒనరించి = సృష్టించి; కవించెన్ = ప్రయోగించె, ప్రేరేపించె; రాజు = రాజు; పైన్ = మీదకు.

భావము:- పళ్ళు పటపట కొరుకుతూ, కళ్ళ నుండి నిప్పుకణాలు చిటపటమని రాలుస్తూ, చెంపలు ఉబ్బుతుండగా, దూర్వాసుడు అతి భీకరంగా హుంకారం చేసాడు. సిగలోని జట ఒకటి పెరికి నేలను కొట్టాడు. దానితో గొప్ప శూలాన్ని చేతబట్టి, మదించిన కృత్యను (పిశాచాన్ని) సృష్టించి, రాజు మీదకు ప్రయోగించాడు.

9-103-వ.

అంత.

టీక:- అంతస్ = అంతట. భావము:- అంతట.

9-104-క.

కాలానల సన్నిభయై
శూలాయుధహస్త యగుచు సుఱసుఱ స్రుక్కన్
నేలఁ బదంబులఁ ద్రొక్కుచు
వాలి మహాకృత్య మనుజవల్లభుఁ జేరెన్.

టీక:- కాలానల = ప్రళయాగ్ని; సన్నిభ = సమానమైనది; ఐ = అయ్యి; శూలాయుధ = శూలాయుధము; హస్త = చేతగలది; అగుచున్ = ఔతూ; సుఱసుఱ = చురచురమని; స్రుక్కన్ = కుంగిపోవునట్లు; నేలన్ = భూమిని; పదంబులన్ = కాళ్ళతో; త్రొక్కుచున్ = తొక్కుతు; వాలి = దూకి; మహా = గొప్ప; కృత్య = పిశాచము; మనుజవల్లభున్ = రాజును; చేరెన్ = దగ్గరకువెళ్ళెను.

భావము:- ఆ భీకరమైన కృత్య శూలం బట్టుకుని, ప్రళయాగ్నిలా చురచుర మంటూ, భూమి కుంగిపోయేలా కాళ్ళతో తొక్కుతు, దూకుతూ రాజు దగ్గరకు వెళ్ళింది.

9-105-ఆ.

ఆ ప్రకార మెఱిఁగి హరి విశ్వరూపుండు
వెట్టి తపసి చేయు వేడబంబుఁ
జక్కఁబెట్టు మనుచుఁ జక్రంబుఁ బంచిన
వచ్చె నదియుఁ బ్రళయవహ్ని పగిది.

టీక:- ఆ = ఆ; ప్రకారమున్ = సంగతి; ఎఱిగి = తెలిసి; హరి = విష్ణుమూర్తి; విశ్వరూపుడు = విష్ణుమూర్తి {విశ్వరూపుడు - విశ్వమేతన రూపమైన వాడు, విష్ణువు}; వెట్టి = తిక్క; తపసి = ముని; చేయు = చేయుచున్న; వేడబంబున్ = వంచనను; చక్కబెట్టుము = సరిచేయుము; అనుచున్ = అంటూ; చక్రంబున్ = సుదర్శనచక్రమును; పంచినన్ = పంపించగా; వచ్చెన్ = వచ్చినది; అదియున్ = ఆదికూడ; ప్రళయవహ్ని = ప్రళయాగ్ని; పగిదిన్ = వలె.

భావము:-ఆసంగతి తెలిసి విష్ణుమూర్తి మునిచేస్తున్న తిక్కవంచనను సరిచేయమంటూ, సుదర్శనచక్రాన్ని పంపించాడు. ఆ చక్రం కూడ ప్రళయాగ్నిలా వచ్చి....

9-106-వ.

వచ్చి మునిపంచిన కృత్యను దహించి, తనివిచనక ముని వెంటం బడిన, మునియును మేరుగుహ జొచ్చిన నదియు నురగంబు వెనుకొను దవానలంబు చందంబునఁ దోన చొచ్చి మఱియును.

టీక:- వచ్చి = చేరి; ముని = ముని; పంచిన = పంపించిన; కృత్యను = కృత్యను; దహించి = కాల్చివేసి; తనివి = తృప్తి; చనక = చెందకుండ; ముని = మునిని; వెంటంబడినన్ = వెంటతగులగ; మునియున్ = ముని; మేరు = మేరు పర్వతపు; గుహన్ = గుహలోనికి; చొచ్చినన్ = దూరగా; అదియును = అదికూడ; ఉరగంబున్ = పామును; వెనుకొను = వెనుతగిలెడి; దవానలంబున్ = కార్చిచ్చు; చందంబునన్ = వలె; తోనన్ = కూడా; చొచ్చి = దూరి; మఱియును = ఇంకను.

భావము:- అంబరీషుని దరిచేరి, ముని ప్రయోగించిన కృత్యను కాల్చివేసి, తృప్తి చెందకుండ దూర్వాసుని వెంట తగులుకుంది. ఆ మునీశ్వరుడు మేరు పర్వతం గుహలోకి దూరాడు. అది కూడ పామును వెనుతగిలె కార్చిచ్చులా గుహలో దూరింది. ఇంక...

9-107-మ.

**భువిఁ దూఱన్ భువిఁ దూఱు; నబ్ధిఁ జొర నబ్ధుల్ జొచ్చు; నుద్వేగియై**
**దివిఁ బ్రాకన్ దివిఁ బ్రాకు; దిక్కులకుఁ బో దిగ్వీథులం బోవుఁ; జి**
**క్కి వెసం గ్రుంగినఁ గ్రుంగు; నిల్వ నిలుచుం; గ్రేడింపఁ గ్రేడించు; నొ**
**క్కవడిన్ దాపసు వెంటనంటి హరిచక్రం బన్యదుర్వక్రమై.**

టీక:- భువిన్ = భూమిలో; దూఱన్ = దూరితే; భువిన్ = భూమిలోకి; దూఱున్ = దూరును; అబ్ధిన్ = సముద్రములో; చొరన్ = దూరితే; అబ్ధుల్ = సముద్రములు; చొచ్చున్ = దూఱును; ఉద్వేగి = కలతచెందినవాడు; ఐ = అయ్యి; దివిన్ = ఆకాశమునకు; ప్రాకన్ = ఎగబ్రాకితే; దివిన్ = ఆకాశమునకు; ప్రాకున్ = ఎగబ్రాకును; దిక్కుల్ = దిశలవైపున; కున్ = కు; పోన్ = పోతే; దిక్ = దిక్కుల; వీథులన్ = దార్లన్నిటికి; పోవున్ = వెళ్ళును; చిక్కి = (ప్రయత్నము) మానివేసి; వెసన్ = విసిగి; క్రుంగినన్ = కుంగిపోతె; కుంగున్ = కుంగును; నిల్వన్ = నిలబడితే; నిలుచున్ = ఆగును; క్రేడింపన్ = పక్కకివెళితే; క్రేడించున్ = పక్కకివెళ్ళును; ఒక్కవడిన్ = ఏకాగ్రముగ; తాపసున్ = ముని; వెంటనంటి = వెనుదగిలి; హరిచక్రంబు = విష్ణుచక్రము; అన్య = ఇతరులచే; దుర్వక్రము = మరలింపరానిది; ఐ = అయ్యి.

భావము:- భూమిలో దూరితే భూమిలోకి దూరుతోంది, సముద్రంలోకి దూరితే సముద్రంలోకి దూరుతోంది. ముని కలతచెంది ఆకాశానికి ఎగబ్రాకితే అది కూడ ఆకాశానికి ఎగబ్రాకుతోంది. ఏ దిక్కుకి ఏ మూలకి పోయినా ఆ దార్లన్నిటిలో వెంట

పడుతోంది. కుంగిపోయి విసిగి నిలబడిపోతే, ఆగుతుంది. పక్కకి వెళితే తనూ పక్కకి వెళ్తుంది. అలా విడువక ముని వెనుదగిలిన విష్ణుచక్రం ఇంకెవరు మరలింపరానిది అయింది.

9-108-శా.

ఏ లోకంబున కైన వెంటఁబడి తోనేతెంచు చక్రానల
జ్వాలల్ మానుపువారు లేమిఁ జని దేవజ్యేష్ఠు లోకేశు వాఁ
డాలోకించి "విధాత! విశ్వజననవ్యాపారపారీణరే
ఖాలీలేక్షణ! కావవే కరుణ జక్రంబుస్ నివారింపవే."

టీక:- ఏ = ఎట్టి; లోకంబుస్ = లోకమున; కి = కి; ఐనస్ = అయినను; వెంటబడి = వెనుగగిలి; తోస్ = కూడ; ఏతెంచుస్ = వచ్చును; చక్ర = చక్రము అనెడి; అనల = అగ్ని; జ్వాలల్ = మంటలను; మానుపు = అపగలగిన; వారు = వారు; లేమిస్ = లేకపోవుటచేత; చని = వెళ్ళి; దేవజ్యేష్ఠుస్ = బ్రహ్మదేవుని {దేవజ్యేష్ఠుడు - దేవతలలో పెద్దవాడు, బ్రహ్మ}; లోకేశుస్ = బ్రహ్మదేవుని {లోకేశుడు - లోకములకుప్రభువు, బ్రహ్మ}; వాడు = అతను; ఆలోకించి = దర్శించి; విధాత = బ్రహ్మదేవా {విధాత - సర్వము సృజించువాడు, బ్రహ్మ}; విశ్వ = లోకములను; జనన = సృష్టించెడి; వ్యాపార = పనిలో; పారీణ = నేర్పు; రేఖా = తీర్పులతో; లీల = విలాసమైన; ఈక్షణ = దృష్టిగలవాడ; కావవే = కాపాడుము; కరుణస్ = దయతో; చక్రంబుస్ = చక్రమును; నివారింపవే = ఆపుము.

భావము:- ఏ లోకానికి వెళ్ళినా వెనకాలే వస్తోంది. చక్రాగ్ని మంటలను అపగలగిన వారు లేకపోవుడంతో, దిక్కుతోచక, బ్రహ్మలోకం వెళ్ళి బ్రహ్మదేవునితో ఇలా మొరపెట్టుకున్నాడు. “విధాత! లోకాలను సృష్టించడంలో నేర్పరివి, నా యందు దయ ఉంచి చక్రాన్ని ఆపు. నన్ను కాపాడు.”

9-109-వ.

**అనిన బ్రహ్మ యిట్లనియె.**

టీక:- అనినన్ = అనగా; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అంతట బ్రహ్మదేవుడు ఇలా పలికాడు.

9-110-మ.

**"కరమర్థిన్ ద్విపరార్థ సంజ్ఞ గల యీ కాలంబుఁ గాలాత్ముఁడై**
**నొరిదిన్ నిండఁగఁ జేసి లోకములు నా చోటున్ విభుం డెవ్వఁడో**
**పరిపూర్తిన్ గనుఁ గ్రేవఁ గెంపుగదురన్ భస్మంబుగాఁజేయు నా**
**హరిచక్రానల కీల కన్యుఁ డొకరుం డడ్డంబు గా నేర్చునే?**

టీక:- కరము = మిక్కిలి; అర్థిన్ = ప్రీతితో; ద్విపరార్థ = ద్విపరార్థ {ద్విపరార్థ - రెండుపదార్థముల ప్రమాణముగలది, భూత భవిష్య లక్షణముగలది}; సంజ్ఞ = అనెడిపేరు; కల = ఉన్నట్టి; ఈ = ఈ; కాలంబున్ = కాలమును; కాలాత్ముడు = కాలస్వరూపుడు; ఐ = అయ్యి; నొరిదిన్ = క్రమముగ; నిండగన్ = పూర్తగునట్లు; చేసి = చేసి; లోకములున్ = లోకములు; ఆ = అవి ఉన్న; చోటున్ = ప్రదేశమును; విభుండు = ప్రభువు; ఎవడో = ఎవరైతే అతడు; పరిపూర్తిన్ = కాలమునిండాక; కను = కళ్ళ; గ్రేవన్ = కొనలందలి; కెంపున్ = ఎఱ్ఱదనము; కదురన్ = గద్దించగా; భస్మంబున్ = కాలిబూడిదైపోయెడిది; కాన్ = అగునట్లు; చేయున్ = చేసెడి; ఆ = ఆ; హరిచక్ర = విష్ణుచక్రము అనెడి; అగ్ని = నిప్పు; కీలల = మంటల; కున్ = కు; అన్యుడు = వేరేవాడు; ఒకరుండు = ఇంకొకడు; అడ్డంబున్ = అపెడివాడు; కాన్ = అగుటకు; నేర్చునే = చేయగలడా, లేడు.

భావము:- “ద్విపరార్థము అనబడెడి ఈ కాలాన్ని కాలస్వరూపుడు అయి, పూర్వార్థం పరార్థం రెంటిలోను కాలాన్ని నడిపి పిమ్మట కాలం తీరునట్లు చేసి లోకములుతో సహా అవి ఉన్న ప్రదేశం సర్వం విష్ణుచక్రాగ్ని కళ్ళు ఎఱ్ఱజేసి గద్దించగా కాలిబూడిదైపోతుంది. అట్టి విష్ణుచక్రాగ్నిని ఎవడూ ఆర్పలేడు.

9-111-ఆ.

ఏను భవుఁడు దక్షుఁ డింద్రాదులును బ్రజా
పతులు భృగుఁడు భూతపతులు శిరము
లందుఁ దాల్తు మతని యాజ్ఞ జగద్ధితం
బంచు భూరికార్యమతుల మగుచు.

టీక:- ఏను = నేను; భవుడుస్ = పరమశివుడు; దక్షుడుస్ = దక్షుడు; ఇంద్రుడుస్ = ఇంద్రుడు; ఆదులునుస్ = మున్నగువారు; ప్రజాపతులుస్ = ప్రజాపతులు; భృగుడుస్ = భృగుడు; భూతపతులుస్ = భూతపతులు; శిరములు = తలల; అందుస్ = మీద; తాల్తుము = ధరించెదము; అతని = అతనియొక్క; ఆజ్ఞస్ = ఆజ్ఞను; జగత్ = లోకములకు; హితంబు = మంచిది; అనుచుస్ = అని తలచుచు; భూరి = గొప్ప {భూరి - అతి పెద్ద సంఖ్య 1 తరువాత 33 సున్నాలు ఉండునది, లక్షకోటికోటికోటికోట్లు}; కార్యమతులము = కార్యాచరణబుద్ధులము; అగుచుస్ = ఔతూ.

భావము:- నేను, పరమశివుడు, దక్షుడు, ఇంద్రుడు, ప్రజాపతులు భృగుడు మున్నగువారు, భూతపతులు అతని ఆజ్ఞను శిరసావహిస్తాము. ఆ ఆజ్ఞకులోబడి ఉంటాము అదే లోకములకు మంచిది అని తలుస్తాము.

9-112-వ.

కావున సుదర్శనానల నివారణంబునకు నోప” నని విరించి పలికిన దుర్వాసుండు కైలాసంబునకుం జనుదెంచి, శర్వు నాలోకించి చక్రా నలంబు తెఱం గెఱింగించిన నమ్మహాదేవుం డిట్లనియె.

టీక:- కావునన్ = అందుచేత; సుదర్శన = విష్ణుచక్రపు; అనల = మంటలను; నివారణంబున్ = మాన్పుట; కున్ = కు; ఓపను = సమర్థుడనుకాను; అని = అని; విరించి = బ్రహ్మదేవుడు; పలికినన్ = చెప్పగా; దుర్వాసుండు = దుర్వాసుడు; కైలాసంబున్ = వెండికొండ {కైలాసము - శివుని స్థానము, కైలాసపర్వతము}; కున్ = కు; చనుదెంచి = వచ్చి; శర్వున్ = పరమశివుని {శర్వుడు - ప్రళయమున భూతములను హింసించువాడు, శంకరుడు}; ఆలోకించి = దర్శించి; చక్ర = విష్ణుచక్రపు; అనలంబు = మంటల; తెఱంగు = విధమును; ఎఱింగించినన్ = తెలుపగా; ఆ = ఆ; మహాత్ముడు = గొప్పవాడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అందుచేత, ఈ చక్రాగ్ని మాన్పుటకు నేను సమర్థుడను కాను.” అని బ్రహ్మదేవుడు చెప్పాడు. దుర్వాసుడు కైలాసానికి వెళ్ళి పరమశివుని దర్శించి విష్ణుచక్రాగ్ని విషయం చెప్పగానే, ఆ మహానుభావుడు ఇలా అన్నాడు.

9-113-సీ.

"వినవయ్య! తండ్రి! ఈ విశ్వేశ్వరుని యందుఁ-
జతురాస్య జీవకోశములు పెక్కు
వేల సంఖ్యలు గూడి వేళతో నిబ్బంగి-
నగుచుండుఁ జనుచుండు; నదియుఁగాక
యెవ్వానిచే భ్రాంతి నేమందుచున్నార-
మేను దేవలుఁ డసురేంద్ర సుతుఁడు,

నారదుఁ డజుఁడు సనత్కుమారుఁడు ధర్ముఁ-

డా కపిలుఁడు మరీచ్యాదు లన్య

9-113.1-ఆ.

పారవిదులు సిద్ధపతులు నెవ్వని మాయ

నెఱుఁగలేము దాన నింత పడుదు

మట్టి నిఖిలనాథు నాయుధశ్రేష్ఠంబుఁ

దొలఁగఁ జేయ మాకు దుర్లభంబు.

టీక:- వినవు = వినుము; అయ్య = బాబు; తండ్రి = నాయనా; ఈ = ఈ; విశ్వేశ్వరుని= నారాయణుని {విశ్వేశ్వరుడు- విశ్వమునకు ఈశ్వరుడు, విష్ణువు}; అందున్ = లో; చతురాస్యజీవకోశములు = బ్రహ్మాండములు {చతురాస్యజీవ కోశము - చతురాస్య (బ్రహ్మ) జీవకోశము (అండము), బ్రహ్మాండము}; పెక్కు = అనేకమైనవి; వేల = వేలు {వేలు - వేయికి బహువచనము}; సంఖ్యలు = కొలది; కూడి = నిర్మింపబడి; వేళ = కాలము; తోను = తోపాటు; ఇబ్బంగిన్ = ఈ విధముగ; అగుచుండున్ = ఏర్పడుచుండును; చనుచుండున్ = లయమగు చుండును; అదియునున్ = అంతే; కాక = కాకుండ; ఎవ్వాని = ఏ ఒక్కని; చేన్ = చేత; భ్రాంతిన్ = మాయను; నేము = మేము; అందుచున్నారము = చెందుచున్నామో; ఏను = నేను; దేవలుడు = పూజారి; అసురేంద్రసుతుడు = ప్రహ్లాదుడు; నారదుడు = నారదుడు; అజుడు = బ్రహ్మదేవుడు; సనత్కుమారుడు = సనత్కుమారుడు; ధర్ముడు = ధర్ముడు; ఆ = ఆ; కపిలుడు = కపిలుడు; మరీచి = మీచి; ఆదుల్ = మున్నగువారు; అపార = అంతులేని; విదులు = జ్ఞానము కలవారు.

సిద్ధ = సిద్ధులలో; పతులు = శ్రేష్ఠులు; ఎవ్వని = ఏ ఒక్కని; మాయన్ = మాయను; ఎఱుంగలేము = తెలియలేమో; దానన్ = దానివలన; ఇంతపడు

దుము = చిన్నబోదుమో; అట్టి = అటువంటి; నిఖిలనాథు = సర్వేశ్వరుని; ఆయుధ = ఆయుధ; శ్రేష్ఠంబుస్ = ఉత్తమును; తొలగజేయ = తప్పించుట; మా = మా; కుస్ = కు; దుర్లభంబు = శక్యముకానిది.

భావము:- "వినుము. నాయనా! దుర్వాసా! నారాయణుని యందు వేలవేల బ్రహ్మాండాలు నిర్మింపబడి కాలంతోపాటు ఏర్పడుతూ లయమవుతూ ఉంటాయి. అంతే కాకుండ ఆయన మాయను మేము చెందుచున్నాం. నేను, ప్రహ్లాదుడు, నారదుడు, బ్రహ్మదేవుడు, సనత్కుమారుడు, ధర్ముడు, కపిలుడు, మరీచి, సిద్ధులు మున్నగు మహా జ్ఞానసంపన్నులం, సిద్ధ శ్రేష్ఠులం ఆయన మాయను తెలియలేం. అటువంటి మహాత్ముడు, సర్వేశ్వరుడు ఐన ఆయన ఆయుధాన్ని తప్పించుట మాకు సాధ్యం కాదు.

**9-114-వ.**

**మునీంద్ర! నీవు నమ్మహాత్ముని శరణంబు వేఁడుము; అతండు మేలు చేయంగలవా" డని పలికిన నీశ్వరునివలన నిరాశుండై దుర్వాసుండు వైకుంఠనగరంబునకుం జని.**

టీక:- ముని = మునులలో; ఇంద్ర = శ్రేష్ఠుడా; నీవుస్ = నీవు; ఆ = ఆ; మహాత్మునిస్ = మహాత్ముని; శరణంబు = రక్షణ; వేడుము = కోరుము; అతండు = అతను; మేలు=మంచి; చేయంగలవాడు= చేయును; అని; పలికినస్= చెప్పగా; ఈశ్వరుని = పరమశివుని; వలన = వలన; నిరాశుండు = భంగపడినవాడు; ఐ = అయ్యి; దుర్వాసుండు = దుర్వాసుడు; వైకుంఠనగరంబుస్ = వైకుంఠము {వైకుంఠము - విష్ణుమూర్తియొక్క లోకము}; కుస్ = కు; చని = వెళ్ళి.

భావము:- మునివరా! నీవు ఆ మహాత్మునే శరణు వేడు. అతను నీకు మంచి చేస్తాడు." అని చెప్పాడు. అలా పరమశివుని వద్ద కూడ భంగపడ్డాక, దుర్వాసుడు వైకుంఠం వెళ్ళి....

9-115-శా.

ఆ వైకుంఠములోని భర్మ మణి సౌధాగ్రంబు పై లచ్చితోఁ

గ్రేవన్ మెల్లన నర్మభాషణములం గ్రీడించు పుణ్యున్ హరిన్

దేవాధీశ్వరుఁ గాంచి "యో వరద! యో దేవేశ! యో భక్తర

క్షావిద్యాపరతంత్ర! మానుపఁగదే చక్రానలజ్వాలలన్,

టీక:- ఆ = ఆ; వైకుంఠము = వైంకుఠము; లోని = అందలి; భర్మ = బంగారు; మణి = రత్నాల; సౌధ = భవనము; అగ్రంబున్ = డాబా; పైన్ = మీద; లచ్చి = లక్ష్మీదేవి; తోన్ = తోటి; క్రేవన్ = పార్శ్వమునందు; మెల్లన = మెల్లిగ; నర్మ భాషణములన్ = సరసపుమాటలతో; క్రీడించు = ఆడుతున్న; పుణ్యున్ = నారాయణుని {పుణ్యుడు - పుణ్యమేతానైనవాడు, విష్ణువు}; హరిన్ = నారాయణుని; దేవేశ్వరున్ = నారాయణుని {దేవేశ్వరుడు - దేవతలకుదేవుడు,విష్ణువు}; కాంచి = దర్శించి; ఓ = ఓ; వరద = వరములనిచ్చెడివాడ; ఓ = ఓ; దేవేశ = దేవతా ప్రభు; ఓ = ఓ; భక్త = భక్తులను; రక్షా = రక్షించెడి; విద్యా = నేర్పునందు; పరతంత్ర = లగ్నమగువాడ; మానుపగదే = పోగొట్టుము; చక్ర = చక్రపు; అనల = అగ్ని; జ్వాలలన్ = మంటలను.

భావము:- అక్కడ వైంకుఠంలో బంగారు రత్నాల భవనం డాబా మీద లక్ష్మీదేవి తోటి సరసపుమాట లాడుతున్న విష్ణువును దర్శించి, ఇలా వేడుకున్నాడు. “ఓ వరద! ఓ దేవతాప్రభు! ఓ భక్తరక్షక! ఈ చక్రాగ్ని మంటలను పోగొట్టు.

9-116-ఉ.

నీ మహిమార్ణవంబు తుది నిక్కముగా నెఱుఁగంగ లేక నీ
ప్రేమకు వచ్చు దాసునకుఁ గ్రించుతనంబున నెగ్గు చేసితిన్
నా మఱపున్ సహింపు మట నారకుఁడైన మనంబులో భవ
న్నామము చింత చేసిన ననంత సుఖస్థితి నొందకుండనే?"

టీక:- నీ = నీయొక్క; మహిమ = మహత్యము అనెడి; అర్ణవము = సముద్రమునకు; తుదిన్ = చివర; నిక్కము = తథ్యముగా; ఎఱుగంగ = తెలిసికొన; లేక = లేక; నీ = నీయొక్క; ప్రేమ = ప్రీతి; కున్ = కి; వచ్చు = పొందిన; దాసున్ = భక్తుని; కున్ = కి; క్రించుదనంబునన్ = అల్పత్వముతో; ఎగ్గు = అపరాధము; చేసితిన్ = చేసితిని; నా = నాయొక్క; మఱపున్ = అజ్ఞానమును; సహింపుము = క్షమించు; అట = అక్కడ; నారకుడు = నరకములోనుండువాడు; ఐనన్ = అయినను; మనంబున్ = మనసు; లోన్ = అందు; భవ = నీయొక్క; నామమున్ = పేరును; చింత = ధ్యానము; చేసినన్ = చేసినచో; అనంత = అంతులేని; సుఖస్థితిన్ = సౌఖ్యములను; అందక = పొందకుండ; ఉండునా = ఉంటాడా, ఉండడు.

భావము:- నీ మహత్యం ఎంతటిదో తెలిసికొన లేని అల్పత్వంతో, నీ పరమ భక్తునికి అపరాధం చేసాను. నా అజ్ఞానాన్ని క్షమించు. నరకంలో ఎంతటి శిక్ష అనుభవిస్తున్న వాడైనా, మనసులో నీ పేరు ధ్యానిస్తే, అంతులేని సౌఖ్యాలను అందుకుంటాడు."

9-117-వ.

అని పలికి పాదకమలంబులకు మ్రొక్కి, లేవక యున్న దుర్వాసునిం
గని హరి యి ట్లనియె.

టీక:- అని = అని; పలికి = పలికి; పాద = పాదములు అనెడి; కమలంబుల్ = పద్మముల; కున్ = కు; మ్రొక్కి = నమస్కరించి; లేవక = పైకిలేవకుండ; ఉన్న = ఉన్నట్టి; దుర్వాసునిన్ = దుర్వాసుడిని; కని = చూసి; హరి = విష్ణుమూర్తి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అని పలికి తన పాదపద్మాలకు మ్రొక్కి పైకిలేవకుండ ఉన్న దుర్వాసుడితో విష్ణుమూర్తి ఇలా చెప్పాడు.

9-118-చ.

"చలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీల దొం
గిలికొనిపోవుచుండుదు రకిల్బిషభక్తిలతాచయంబులన్
నిలువఁగఁ బట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికైవడిన్;
వలలకుఁ జిక్కి భక్తజన వత్సలతం జనకుందుఁ దాపసా!

టీక:- చలమునన్ = పట్టుదలతో; బుద్ధిమంతులు = జ్ఞానముగలవారు; అగు = అయిన; సాధులు = మంచివారు; నా = నాయొక్క; హృదయంబున్ = మనసును; లీలన్ = సులువుగా; దొంగిలికొనిపోవుచన్ = ఎత్తుకుపోతూ; ఉండుదురు = ఉంటారు; అకిల్బిష = నిర్మలమైన; భక్తి = భక్తి యనెడి; లత = తీగల; చయంబులన్ = సమూహములచే; నిలువగన్ = ఆగిపోవునట్లు; పట్టి = పట్టుపట్టి; కట్టుదురున్ = కట్టివేయుదురు; నేరుపు = నేర్పు; తోన్ = తోటి; మద = మదించిన; కుంభి = ఏనుగు {కుంభి - కుంభములుగలది, ఏనుగు}; కైవడిన్ = వలె; వలలన్ = వలలందు; చిక్కి = తగులుకొని; భక్త = భక్తులఎడ; వత్సలతన్ =

వాత్సల్యము; కుస్ = వలన; చనక = తప్పించుకుపోకుండ; ఉందుస్ = ఉండెదను; అధిపా = గొప్పవాడా.

భావము:- "మహాత్మా! పట్టుదలతో జ్ఞానులు, మంచివారు నా మనసు సుళువుగా ఎత్తుకుపోతూ ఉంటారు. గొప్ప నేర్పుతో మదగజాన్ని బంధించినట్లు, వారి నిర్మల భక్తితీగలతో పట్టుపట్టి కట్టిపేస్తారు. భక్తుల ఎడ వాత్సల్యతో తప్పించుకుపోకుండ ఉండిపోతాను.

**9-119-ఆ.**

**నాకు మేలు గోరు నా భక్తుఁ డగువాఁడు**

**భక్తజనుల కేన పరమగతియు;**

**భక్తుఁడెందు జనినఁ బఱతెంతు వెనువెంట**

**గోవు వెంటఁ దగులు కోడె భంగి.**

టీక:- నా = నా; కుస్ = కు; మేలు = మంచి; కోరుస్ = కోరుకొనును; నా = నా యొక్క; భక్తుడు = భక్తుడు; అగువాడు = ఐనవాడు; భక్త = భక్తులు; జనులు = అందరకు; ఏన = నేను; పరమ = అత్యుత్తమమైన; గతియుస్ = దిక్కు; భక్తుడు = భక్తుడు; ఎందుస్ = ఎక్కడకు; చనినస్ = వెళ్ళినను; పఱతెంతు = వెళ్ళెదను; వెనువెంట = కూడకూడ; గోవు = ఆవు; వెంటస్ = కూడా; తగులు = పడెడు; కోడె = మగ దూడ; భంగి = వలె.

భావము:- నా భక్తుడు, నా మంచినే కోరుకుంటాడు. భక్తులకు నేను సాటిలేని దిక్కును గనుక, భక్తుడు ఎక్కడకు వెళ్ళినా, ఆవు వెంట పోయే దూడ మాదిరి, నేను భక్తుని వెంట వెళ్తాను.

**9-120-వ.**

**అదియునుం గాక.**

టీక:- అదియునుస్ = అంతే; కాక = కాకుండగ.

భావము:- అంతే కాకుండగ.

9-121-ఆ. *

తనువు మనువు విడిచి, తనయులఁ జుట్టాల
నాలి విడిచి, సంపదాలి విడిచి,
నన్నుకాని యన్య మెన్నఁడు నెఱుఁగని
వారి విడువ నెట్టివారి నైన.

టీక:- తనువుస్ = దేహమును; మనువుస్ = జీవితాన్ని; విడిచి = వదలి; తనయులస్ = పిల్లలను; చుట్టాలస్ = బంధువులను; ఆలిస్ = భార్యను; విడిచి = వదలివేసి; సంపద = సంపదలు; అలి = అన్నిటిని; విడిచి = వదిలేసి; నన్ను = నన్నుమాత్రము; తప్పించి = తప్పించి; అన్యము = ఇతరము; ఎన్నడుస్ = ఎప్పుడు; ఎఱుగని = తెలియని; వారిస్ = వారిని; విడువస్ = వదలిపెట్టను; ఎట్టి = ఎలాంటి; వారిస్ = వారు; ఐనస్ = అయినప్పటికిని.

భావము:- తమ దేహాన్ని, జీవితాన్ని, వదలి; భార్యాపిల్లలను, బంధువులను, సకల సంపదలను అన్నిటిని వదిలేసి కేవలం నన్ను తప్పించి ఇతరం ఏమి తెలియని వారిని, వారు ఎలాంటివారు అయినా సరే, వారిని నేను వదలిపెట్టను.

9-122-క.

పంచేంద్రియముల తెరువుల
వంచించి మనంబునందు వరమతులు ప్రతి
ష్టించి వహింతురు నన్నును
మంచివరుం బుణ్యసతులు మరగిన భంగిస్.

టీక:- పంచేంద్రియముల = జ్ఞానేంద్రియములయొక్క {పంచేంద్రియములు - త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణులు యనెడి జ్ఞానేంద్రియములు}; తెరువులు = మార్గాలను; వంచించి = స్వాధీనపరచుకొని; మనంబున్ = మనసు; అందున్ = లోపల; వర = ఉత్తమమైన; మతులు = బుద్ధిమంతులు; ప్రతిష్ఠించి = నిలుపుకొని; వహింతురు = ధరింతురు; నన్నును = నన్ను; మంచి = మంచివాడైన; వరున్ = భర్తను; పుణ్య = పుణ్యాత్ములైన; సతులు = స్త్రీలు; మరిగిన = మోహించెడి; భంగిన్ = విధముగ.

భావము:- పతివ్రతలు భర్తను మంచివాడిగా మోహించి స్వాధీనం చేసుకుంటారు. అదే విధంగ, సత్పురుషులు పంచేంద్రియాలను స్వాధీనపరచుకొని మనసున నన్ను నిలుపుకుంటారు.

9-123-క.

సాధుల హృదయము నాయది;
సాధుల హృదయంబు నేను; జగముల నెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాధు లెఱుంగుదురు నాదు చరితము విప్రా!

టీక:- సాధుల = మంచివారి; హృదయము = హృదయము; నాయది = నాది; సాధుల = మంచివారి; హృదయంబున్ = హృదయమే; నేను = నేను; జగములన్ = లోకములు; ఎల్లన్ = అన్నిటిలోను; సాధులన్ = మంచివారిని; నేన = నేనే; ఎఱుంగుదున్ = ఎరుగుదును; సాధులు = మంచివారు; ఎఱుంగుదురు = తెలిసికొందురు; నాదు = నాయొక్క; చరితమున్ = చరిత్రను; విప్రా = బ్రాహ్మణుడా.

భావము:- బ్రాహ్మణుడా! దుర్వాసా! సాధువుల హృదయం నాది. సాధువుల హృదయమే నేను. సకల లోకాలలో ఉన్న సాధువులను నేను ఎరుగుదును. వారికి నా చరిత్ర తెలుసును.

9-124-ఆ.

ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు
ముక్తి చేయుచుండు ముదముతోడ;
దుర్వినీతులగుచు దుర్జనులగువారి
కివియుఁ గీడు జేయ కేల యుండు?

టీక:- ధారుణీసురుల్ = బ్రాహ్మణుల; కున్ = కు; తపము = తపస్సు; విద్యయున్ = వేదజ్ఞానము; రెండున్ = రెండు (2); ముక్తి = మోక్షమును; చేయుచుండున్ = కలిగించును; ముదము = సంతోషము; తోడన్ = తోటి; దుర్వినీతులు = వినయము నీతిలేనివారు; అగుచున్ = ఔతూ; దుర్జనులు = చెడ్డవారు; అగు = ఐన; వారిన్ = వారి; కిన్ = కి; ఇవియున్ = ఇవే; కీడు = చెడు; చేయక = చేయకుండ; ఏల = ఎందుకు; ఉండు = ఉంటాయి.

భావము:- సద్బ్రాహ్మణులకు తపస్సు వేదజ్ఞానం రెండు (2) మోక్షాన్ని కలిగిస్తాయి. వినయము నీతి లేనివారు అయిన చెడ్డ విప్రులకు అవి చెడు చేయకుండ ఎందుకు ఉంటాయి?

9-125-క. *

నా తేజము సాధులలో
నాతతమై యుండు వారి నలఁచు జనులకున్
హేతి క్రియ భీతి నిచ్చుం
జేతోమోదంబుఁ జెఱచు సిద్ధము సుమ్మీ.

టీక:- నా = నాయొక్క; తేజముస్ = తేజస్సు; సాధుల = మంచివారి; లోస్ = లో; ఆతతము = విరివియైనది; ఐ = అయ్యి; ఉండుస్ = ఉండును; వారిస్ = వారిని; అలచు = కష్టపెట్టెడి; జనుల = వారి; కుస్ = కి; హేతి = అగ్నిశిఖల; క్రియస్ = వలె; భీతిస్ = భయమును; ఇచ్చుస్ = కలుగజేయును; చిత్ = మానసిక; మోదంబుస్ = సంతోషమును; చెఱచుస్ = పాడుచేయును; సిద్ధము = తప్పకుండ; సుమ్మీ = సుమా.

భావము:- నా తేజస్సు సాధుపురుషులలో విరివిగా ఉంటుంది. వారిని కష్టపెట్టే వారికి అగ్నిశిఖల వలె భయాలను కలుగజేస్తుంది. వారికి తప్పకుండ మానసిక సంతోషం లేకుండా చేస్తుంది సుమా.

9-126-క.

అదె వో బ్రాహ్మణ! నీకును
సదయుఁడు నాభాగసుతుఁడు జనవినుత గుణా
స్పదుఁ డిచ్చు నభయ మాతని
మది సంతసపఱచి వేఁడుమా శరణంబుస్."

టీక:- అదె = అందుకనే; వో = వెళ్ళుము; బ్రాహ్మణ = విప్రుడా; నీ = నీ; కునుస్ = కుకూడ; సదయుడు = దయగలవాడు; నాభాగసుతుడు = అంబరీషుడు; జన = లోకులచే; వినుత = కీర్తింపబడు; గుణ = సుగుణములు; ఆస్పదుడు = నివాసమైనవాడు; ఇచ్చుస్ = ఇచ్చును; అభయము = రక్షణను; ఆతనిస్ = అతనిని; మదిస్ = మనసును; సంతసపఱచి = సంతోషపెట్టి; వేడుమా = వేడుము; శరణంబుస్ = శరణు.

భావము:- ఓ విప్రుడా! అందుచేత వెళ్ళు లోకులచే కీర్తింపబడే సుగుణాలు కల అంబరీషుడు దయగలవాడు, అతను నీకు రక్షణను ఇస్తాడు. అతని మనసును సంతోషపెట్టి శరణు వేడు."

9-127-మ.

అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన మహోద్యచ్చక్రకీలావళీ
జనితాయాసుఁడు నిర్వికాసుఁ డుదితశ్వాసుండు దుర్వాసుఁడ
ల్లన యేతెంచి సుభక్తిఁ గాంచెఁ గరుణాలావణ్య వేషున్ విదో
షు నయోదారమనీషు మంజుమితభాషున్ నంబరీషున్ వెసన్.

టీక:- అని = అని; శ్రీవల్లభుడు = విష్ణుమూర్తి {శ్రీవల్లభుడు - శ్రీ (లక్ష్మీదేవి) వల్లభుడు (భర్త), విష్ణువు}; ఆనతిచ్చినన్ = ఆజ్ఞాపించగా; మహా = మిక్కిలి; ఉద్యత్ = ఎగసిపడెడి; చక్ర = విష్ణుచక్రముయొక్క; కీలా = మంటల; అవళీ = ఉపద్రవమువలన; జనిత = పొందిన; ఆయాసుడు = ఆయాసముకలవాడు; నిర్వికాసుడు = వికాసముతప్పినవాడు; ఉదితశ్వాసుడు = రొప్పుతున్నవాడు; దుర్వాసుడు = దుర్వాసుడు; అల్లన = తిన్నగా; ఏతెంచి = వచ్చి; సు = మంచి; భక్తిన్ = భక్తితోటి; కాంచెన్ = చూసెను; కరుణా = దయతో కూడిన; లావణ్య = చక్కని; వేషున్ = ధరించినవానిని; విదోషున్ = దోషములులేనివానిని; నయ = మిక్కిలి; ఉదార = త్యాగశీలమైన; మనీషున్ = మనసుగలవానిని; మంజు = హితవుగ; మిత = పరిమితముగ; భాషున్ = మాట్లాడువానిని; అంబరీషున్ = అంబరీషుని; వెసన్ = శ్రీఘ్రమే.

భావము:- అని లక్ష్మీపతి ఆజ్ఞాపించగా, ఎగసిపడె విష్ణుచక్రము మంటల ఉపద్రవంవలన పొందిన ఆయాసం కలవాడు, వికాసం తప్పి రొప్పుతున్నవాడు అయిన దూర్వాసుడు తిన్నగా దయామయుడు, నిర్దోషి, త్యాగశీలి, హితమితభాషి అయిన అంబరీషుని వద్దకు శ్రీఘ్రమే వచ్చి, మంచి భక్తితో దర్శించాడు.

9-128-వ.

కని దుఃఖితుండయి, యమ్మహీవల్లభు పాదంబులు పట్టి విడువ కున్న నా నరేంద్రచంద్రుండు చరణస్పర్శనంబునకు నోడుచుఁ గరుణా రసభరిత హృదయుండయి, హరిచక్రంబు నిట్లని స్తుతియించె.

టీక:- కని = దర్శించి; దుఃఖితుడు = దుఃఖించెడివాడు; అయి = ఐ; ఆ = ఆ; మహీవల్లభు = రాజుయొక్క; పాదంబులున్ = కాళ్ళను; పట్టి = పట్టుకొని; విడువకున్నన్ = వదలకపోగా; ఆ = ఆ; నరేంద్రచంద్రుండు = మహారాజు {నరేంద్రచంద్రుడు - నరేంద్రులు (రాజులు) అనెడి తారలలో చంద్రునివంటివాడు, మహారాజు}; చరణస్పర్శంబున్ = కాళ్లుపట్టుకొనుటచేత; ఓడుచున్ = కరిగిపోతూ; కరుణా = కృపయనెడి; రస = రసముచే; భరిత = నిండిన; హృదయుండు = హృదయముగలవాడు; అయి = అయ్యి; హరిచక్రంబున్ = విష్ణుచక్రమును; ఇట్లు = ఈ విధముగ; అని = అని; స్తుతియించె = కీర్తించెను.

భావము:- అలా దర్శించిన దూర్వాసుడు దుఃఖిస్తూ ఆ రాజు కాళ్ళను వదలకుండా పట్టుకొన్నాడు. ఆ కృపారసహృదయుడు అంబరీష మహారాజు కరిగిపోయి విష్ణుచక్రాన్ని ఈ విధంగ కీర్తించాడు.

9-129-సీ.

"నీవ పావకుఁడవు; నీవ సూర్యుండవు-
నీవ చంద్రుండవు; నీవ జలము;
నీవ నేలయు; నింగి నీవ; సమీరంబు-
నీవ; భూతేంద్రియ నికర మీవ;
నీవ బ్రహ్మంబును; నీవ సత్యంబును-
నీవ యజ్ఞంబును; నీవ ఫలము;

నీవ లోకేశులు; నీవ సర్వాత్మయు-
నీవ కాలంబును; నీవ జగము;

9-129.1-తే.

నీవ బహుయజ్ఞభోజివి; నీవ నిత్య
మూలతేజంబు; నీకు నే మ్రొక్కువాఁడ
నీరజాక్షుండు చాల మన్నించు నట్టి
శస్త్రముఖ్యమ! కావవే చాలు మునిని.

టీక:- నీవ = నీవే; పావకుడవు = అగ్నివి; నీవ = నీవే; సూర్యుండవుస్ = సూర్యుడవు; నీవ = నీవే; చంద్రుండవు = చంద్రుడవు; నీవ = నీవే; జలము = నీరు; నీవ = నీవే; నేలయుస్ = భూమి; నింగి = ఆకాశము; నీవ = నీవే; సమీరంబు = గాలివి; నీవ = నీవే; భూత = ప్రాణులు; ఇంద్రియ = ఇంద్రియముల; నికరము = సమూహము; ఈవ = నీవే; నీవ = నీవే; బ్రహ్మంబును = సృష్టికర్తవు; నీవ = నీవే; సత్యంబును = సత్యము; నీవ = నీవే; యజ్ఞంబును = యజ్ఞము; నీవ = నీవే; ఫలము = యజ్ఞఫలితము; నీవ = నీవే; లోకేశులుస్ = సర్వలోకాధిపతులు; నీవ = నీవే; సర్వ = అందరిలోను; ఆత్మయుస్ = ఉండెడివాడవు; నీవ = నీవే; కాలంబును = కాలము; నీవ = నీవే; జగముస్ = భువనము.

నీవ = నీవే; బహు = అనేకములైనట్టి; యజ్ఞ = యజ్ఞఫలమును; భోజివి = పొందెడివాడవు; నీవ = నీవే; నిత్య = శాశ్వతమైన; మూల = ఆధారభూతమైన; తేజంబుస్ = తేజస్సువి; నీవు = నీ; కుస్ = కు; నేస్ = నేను; మ్రొక్కువాడస్ = నమస్కరించుచున్నాను; నీరజాక్షుండు = విష్ణుమూర్తి {నీరజాక్షుండు - నీరజ

(పద్మ ము)లవంటి అక్షుడు (కన్నులుగలవాడు), విష్ణువు}; చాల = బాగ; మన్నించునట్టి = గౌరవించెడి; శస్త్ర = ఆయుధ; ముఖ్యమ = శ్రేష్ఠమ; కావవే = కాపాడుము; చాలు = ఇకచాలును; మునిని = ఋషిని.

భావము:- “శ్రీమహావిష్ణువు గౌరవించే ఆయుధ శ్రేష్ఠమ! నీవే అగ్నివి; నీవే సూర్యుడవు; నీవే చంద్రుడవు; నీవే నీరు; నీవే భూమి; ఆకాశము నీవే; గాలివి నీవే; సకల ప్రాణులు, ఇంద్రియాలు నీవే; సృష్టికర్తవు నీవే; సత్యం నీవే; యజ్ఞం నీవే; నీవే యజ్ఞఫలితం; సర్వలోకాధిపతులు నీవే; నీవే సర్వాత్మవు; నీవే కాలం; నీవే భువనము; నీవే యజ్ఞఫలమును పొందేవాడవు; నీవే నిత్య మూల తేజస్సువి; నీకు నేను నమస్కరిస్తున్నాను. ఇకచాలును ఈ ఋషిని కాపాడు.

9-130-మ.

హరిచే నీవు విసృష్టమై చనఁగ మున్నాలించి నీ ధారలన్
ధరణిన్ వ్రాలుట నిక్కమంచు మునుపే దైత్యేశ్వరవ్రాతముల్
శిరముల్ పాదములున్ భుజాయుగళముల్ చేతుల్ నిజాంగంబులం
దురులన్ బ్రాణసమీరముల్ వదలు నీ యుద్ధంబులం జక్రమా!

టీక:- హరి = విష్ణుమూర్తి; చేన్ = చేత; నీవున్ = నీవు; విసృష్టము = విసరబడినది; ఐ = అయ్యి; చనగన్ = వెళ్ళగా; మున్ను = ముందు; ఆలించి = పసిగట్టి; నీ = నీయొక్క; ధారలన్ = పదునులచే; ధరణిన్ = నేలమీద; వ్రాలుట = పడిపోవుట; నిక్కము = తప్పనిది; అనుచున్ = భావించుకొని; మునుపే = ముందుగానే; దైత్య = రాక్షస; ఈశ్వర = ప్రభువుల; వ్రాతముల్ = సమూహములు; శిరముల్ = తలలు; పాదములున్ = కాళ్ళు; భుజా = భుజముల; యుగళముల్ = జంటలు (2); చేతుల్ = చేతులు; నిజ = తమ; అంగంబులన్ = దేహములందు; దురలన్ = దురపిల్లగా, కలతనొందగా;

ప్రాణసమీరముల్ = ప్రాణవాయువులను; వదలున్ = వదలెదరు; నీ = నీవుచేసెడి; యుద్ధంబులన్ = యుద్ధములలో; చక్రమా = ఓ చక్రమా.

భావము:- ఓ చక్రరాజమా! విష్ణుమూర్తి దుష్ట రాక్షస ప్రభువుల పైకి నిన్ను ప్రయోగించగా, వారు నీరాక ముందుగానే పసిగట్టి నీ అంచుల పదునులచే నేలపడుట తప్పదని, తలలు కాళ్ళు భుజాలు చేతులు తెగిపోతాయని గ్రహించి, కలతనొంది ప్రాణాలు వదలుతారు.

**9-131-ఆ.**

కలఁగి నిద్రపోవఁ గలలోన వచ్చిన
నిన్నుఁ జూచి దీర్ఘనిద్ర పోదు
రసురవరులు శయ్యలం దున్న సతులు ప్ర
భాతమందు లేచి పలవరింప.

టీక:- కలగినిద్రపోవన్ = కలతనిద్రపోతుండగ; కల = స్వప్నము; లోనన్ = అందు; వచ్చిన = కనిపించిన; నిన్నున్ = నిన్ను; చూచి = చూసి; దీర్ఘనిద్రపోదురు = చనిపోతారు; అసుర = రాక్షస; వరులు = శ్రేష్ఠులు; శయ్యలు = పక్కల; అందున్ = అందు; ఉన్న = ఉన్నట్టి; సతులు = భార్యలు; ప్రభాతము = ఉదయపు; అందున్ = సమయమున; లేచి = నిద్రలేచి; పలవరింపన్ = గొల్లుమనగ.

భావము:- కలతనిద్ర పోతుండగా వచ్చిన స్వప్నంలో నీవు కనిపిస్తే చాలు, ఎంతటి రాక్షసులు అయినా నిద్రలోనే మరణిస్తారు. ప్రక్కనే నిద్రిస్తున్న భార్యలు ఉదయం నిద్రలేచి గొల్లుమంటారు.

**9-132-ఉ.**

చీఁకటిఁ బాపుచున్ వెలుఁగు జేయుచు సజ్జనకోటినెల్ల స
శ్రీకను జేయు నీరుచులు చెల్వుగ ధర్మసమేతలై నినున్

వాకున నిట్టి దట్టిదని వర్ణన చేయ విధాత నేరఁ డ
స్తోకము నీదు రూపు గలదుం దుది లేదు పరాత్పరాద్యమై.

టీక:- చీకటిస్ = చీకటిని; పాపుచుస్ = పారద్రోలుచు; వెలుగుస్ = కాంతిని; చేయుచుస్ = పుట్టిస్తూ; సజ్జన = మంచివారి; కోటిస్ = సమూహములు; ఎల్లస్ = అన్నిటిని; సశ్రీకనుస్ = సుసంపన్నము; చేయుస్ = చేయును; నీ = నీయొక్క; రుచులు = కాంతులు; చెల్వుగ = చక్కగా; ధర్మసమేతలు = ధర్మముగలవారు; ఐ = అయ్యి; నినుస్ = నిన్ను; వాకున = నోటితో; ఇట్టిదట్టిది = వివరముగ; అని = పలికి; వర్ణనచేయస్ = కీర్తించుటకు; విధాత = బ్రహ్మదేవుడు; నేరడు = సరిపోడు; అస్తోకము = మహోన్నతము; నీదు = నీయొక్క; రూపుస్ = స్వరూపము; కలదు = ఉన్నది; అందుస్ = దానిలో; తుది = అంతము; లేదు = లేదు; పరాత్పర = విష్ణుమూర్తితో; ఆద్యము = మొదలైనది; ఐ = అయ్యి.

భావము:- ధర్మమైన నీ కాంతులు చీకటిని పారద్రోలుతూ సజ్జనులను, ధర్మాత్ములను సుసంపన్నం చేస్తాయి. నిన్ను కీర్తించుటకు బ్రహ్మదేవుడికే సాధ్యం కాదు. నీది మహోన్నతమై, అనంతమై పరాత్పర స్వరూపం.

9-133-ఆ.

కమలలోచనుండు ఖలుల శిక్షింపంగఁ
బాలు చేయ నీవు పాలు పడితి
పైన నింకఁజాలు నాపన్నుఁడై యున్న
తపసిఁ గావు మీవు ధర్మవృత్తి."

టీక:- కమలలోచనుండు = నారాయణుడు {కమలలోచనుడు – కమలముల వంటి కన్నులుగలవాడు, విష్ణువు}; ఖలులన్ = దుష్టులను; శిక్షింపంగన్ = శిక్షించుటకై; పొలుచేయ = పంపించగా; నీవున్ = నీవు; పొలుపడితివి = పూనుకొంటివి; ఐనన్ = అయినను; ఇంకజాలున్ = ఇకచాలును; ఆపన్నుడు = ఆపదలోచిక్కినవాడు; ఐ = అయ్యి; ఉన్న = ఉన్నట్టి; తపసిన్ = మునిని; కావుము = కాపాడుము; ఈవున్ = నీవు; ధర్మవృత్తి = పుణ్యవంతమైనవిధముగ.

భావము:- విష్ణుమూర్తి దుష్టులను శిక్షించుటానికి నిన్ను పంపించాడు. నీవు ఈ పనికి పూనుకున్నావు. సరే, ఇక చాలు ఆపదలో చిక్కిన ఈ ఋషిని ధర్మ వృత్తితో కాపాడు."

9-134-వ.

**అని వినుతించి కేలుఁ దమ్మిదోయి నొసలం బొసంగించి యిట్లనియె.**

టీక:- అని = అని; వినుతించి = కీర్తించి; కేలు = చేయి అనెడి; దమ్మి = పద్మముల; దోయి = జంటను (2); నొసల్ = నొసటిపైన; పొసగించి = పొందుపరచి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అని కీర్తించి అంబరీషుడు చేతులను నొసటిపై జోడించి ఇలా అన్నాడు.

9-135-ఆ.

**"ఏ నమస్కరింతు నింద్రశాత్రవ ధూమ**
**కేతువునకు ధర్మ సేతువునకు**
**విమల రూపమునకు విశ్వదీపమునకుఁ**
**జక్రమునకు గుప్త శక్రమునకు."**

టీక:- ఏన్ = నేను; నమస్కరింతున్ = నమస్కరించుచున్నాను; ఇంద్ర = ఇంద్రును; శాత్రవ = శత్రువులను; ధూమకేతువున్ = దహించివేయుదాని

{ధూమకేతువు - ధూమము (పొగ)ను కేతువు (గుర్తుగాగలది), అగ్ని, తోకచుక్క}; కున్ = కి; ధర్మ = ధర్మమును; సేతువున్ = కాపాడునది (సేతువువలె); కున్ = కి; విమల = స్వచ్ఛమైన; రూపమున్ = స్వరూపమున; కున్ = కి; విశ్వ = భువనములకు; దీపమున్ = వెలుగునిచ్చెడిదాని; కున్ = కి; చక్రమున్ = విష్ణుచక్రమున; కున్ = కు; గుప్త = కాపాడబడిన; శక్రమున్ = ఇంద్రుడుకలదాని {శక్రుడు - దుష్టులను శిక్షించుటందు శక్తిగల వాడు, ఇంద్రుడు}; కున్ = కి.

భావము:- “ఇంద్రుడి శత్రువులను దహించివేసేది, ధర్మాన్ని కాపాడు సేతువు, పరిశుద్ధ స్వరూపం, సతల భువనదీపం, ఇంద్రుని కాపాడెడి చక్రం అయిన సుదర్శన చక్రానికి నేను నమస్కారం చేస్తున్నాను.”

9-136-వ.

**అని మఱియు నిట్లనియె.**

టీక:- అని = అని; మఱియున్ = ఇంకను; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అని స్తుతించి ఇకా ఇలా పలికాడు.

9-137-ఆ.

**"విహిత ధర్మమందు విహరింతు నేనియు**
**నిష్టమైన ద్రవ్యమిత్తునేని**
**ధరణిసురుఁడు మాకు దైవతం బగునేని**
**విప్రునకు శుభంబు వెలయుఁగాక.**

టీక:- విహిత = విధాయకమైన; ధర్మము = ధర్మమార్గము; అందున్ = లోనే; విహరింతున్ = నడచుచుంటిని; ఏనియున్ = అయినచో; ఇష్టము = కోరబడినది; ఐనన్ = అయినట్టి; ద్రవ్యమున్ = ధనమును; ఇత్తును = ఇచ్చుచుంటిని; ఏని =

అయినచో; ధరణిసురుడు = విప్రుడు {ధరణిసురుడు - ధరణి (భూమిమీది) సురుడు (దేవత), బ్రాహ్మణుడు}; మా = మా; కున్ = కు; దైవతంబున్ = దైవస్వరూపుడు; అగునేని = అయినట్లయితే; విప్రున్ = బ్రాహ్మణున; కున్ = కు; శుభంబు = శుభము; వెలయుగాక = కలుగునుగాక.

భావము:- "నేనే కనుక ధర్మమార్గ విధాయకంగ నడచే వాడిని అయితే, విప్రులు కోరిన ధనాన్ని దానం చేసేవాడను అయితే, విప్రుడు మాకు దైవస్వరూపుడు అయితే, ఈ బ్రాహ్మణుడు దుర్వాసునకు శుభం కలుగు గాక.

9-138-క.

అఖిల గుణాశ్రయుఁ డగు హరి
సుఖియై నా కొలువు వలనఁ జొక్కెడి నేనిన్
నిఖిలాత్మమయుం డగుటకు
సుఖమందుం గాక భూమిసురుఁ డివ్వేళన్."

టీక:- అఖిల = సర్వ; గుణ = గుణములందును; ఆశ్రయుడు = చేరియుండువాడు; హరి = విష్ణువు; సుఖి = సంతోషించినవాడు; ఐ = అయ్యి; నా = నాయొక్క; కొలువు = సేవ, ఆరాధన; వలన = వలన; చొక్కెడిని = తృప్తిచెందెను; ఏనిన్ = అయినచో; నిఖిల = సర్వా; ఆత్మన్ = ఆత్మలయందున్; మయుండు = నిండియుండువాడు; అగుటకు = ఐనట్లునిదర్శనముగా; సుఖమున్ = సుఖమును; అందుగాక = పొందుగాక; భూమిసురుడు = బ్రాహ్మణుడు {భూమిసురుడు - భూమికిదేవత, విప్రుడు}; ఈ = ఈ; వేళన్ = సమయమున.

భావము:- నా సేవ, ఆరాధనలకు సర్వగుణాత్మకుడు, సర్వాత్మకుడు అయిన శ్రీమహావిష్ణువు సంతోషించి తృప్తిచెందినట్లయితే, నిదర్శనంగా ఈ మునీశ్వరుడు ఇప్పుడే శాంతిని పొందుగాక."

9-139-వ.

**అని యివ్విధంబునం బొగడు పుడమిఱేనివలన మన్నించి, తపసిని దాహంబు నొందింపక, రక్కసులగొంగచక్రంబు తిరిగి చనియె; నంత దుర్వాసుండు శాంతిం బొంది మెల్లని మేలి మాటల నా రాజుం దీవించి, యిట్లనియె.**

టీక:- అని = అని; ఈ = ఈ; విధంబునన్ = విధముగా; పొగడు = స్తుతించెడి; పుడమిఱేని = రాజు; వలన = ఎడల; మన్నించి = క్షమించి; తపసిని = మునిని; దాహంబున్ = తాపమును; ఒందింపక = చెందించకుండ; రక్కసులగొంగ చక్రంబు = విష్ణుచక్రము {రక్కసులగొంగచక్రము - రాక్షసుల శత్రువు (విష్ణువు) యొక్క చక్రము}; తిరిగిచనియె = వెనుదిరిగెను; అంతన్ = అప్పుడు; దుర్వాసుండు = దుర్వాసుడు; శాంతిన్ = ప్రశాంతతను; పొంది = పొందిన; మెల్లని = సున్నితమైన; మేలి = మంచి; మాటలన్ = మాటలతో; ఆ = ఆ; రాజును = రాజును; దీవించి = ఆశీర్వదించి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అని రాజు ఈ విధంగా స్తుతించగా, మునిని క్షమించి, ఇక తాపం చెందించకుండ విష్ణుచక్రం వెనుదిరిగి తరలి పోయింది. అప్పుడు దుర్వాసుడు ప్రశాంతతను పొంది చల్లని మంచి మాటలతో ఆ రాజును ఆశీర్వదించి ఇలా పలికాడు.

9-140-మ.

**"నరనాథోత్తమ! మేలు చేసితి కదా! నా తప్పు మన్నించి శ్రీ**
**హరి పాదాబ్జము లింత ముట్టఁగొలుతే? యాశ్చర్యమౌనెన్నుచో**
**నరుదండ్రే నినుబోఁటి సాధునకుఁ దాసై యిచ్చుటల్ గాచుటల్**
**సొరిదిన్ నైజగుణంబులై సరస వచ్చుం గాదె మిత్రాకృతిన్.**

టీక:- నరనాథోత్తమ = మహారాజ {నరనాథోత్తముడు - నరనాథు (రాజు)లలో ఉత్తముడు, మహారాజు}; మేలు = ఉపకారము; చేసితి = చేసావు; కదా = సుమా; నా = నాయొక్క; తప్పున్ = పొరపాటును; మన్నించి = క్షమించి; శ్రీహరి = విష్ణుని; పాదములున్ = పాదములను; ఇంత = చాలా ఎక్కువగా; ముట్టన్ = గాఢముగా; కొలుతే = సేవించితివి; ఆశ్చర్యము = ఆశ్చర్యకరము; ఔన్ = ఐనది; ఎన్నుచో = తరచిచూసినచో; అరుదు = అపూర్వమైనది; అండ్రే = అంటారా, అనరు; నినున్ = నిన్ను; పోటి = వంటి; సాదున్ = మంచివాని; కున్ = కి; తానై = తనంతతానే; ఇచ్చుటల్ = దానముచేయుటలు; కాచుటల్ = కాపాడుటలు; సొరిదిని = మామూలుగా; నైజ = సహజ; గుణంబులు = గుణములు; ఐ = అయ్యి; సరసన్ = సుళువుగా; వచ్చున్ = సంప్రాప్తించును; కాదే = కదా; మిత్ర = మిత్రుని; ఆకృతిన్ = వలె.

భావము:- “నా పొరపాటును క్షమించి ఉపకారం చేసావు సుమా అంబరీష! విష్ణుపాదాలను ఎంత గాఢంగా సేవించావు. ఇలా నీవు నన్ను కాపాడుట ఆశ్చర్యకరము కాదు అపూర్వము కాదు. ఎందుకంటే నీ వంటి మంచివానికి దానాలు చేయుట, కాపాడుటలు అతి సహజ గుణాలు. ఆ సుగుణాలు సూర్యభగవానునికి వలె నీవంటి వారికి సుళువుగా సంప్రాప్తిస్తాయి కదా.

**9-141-వ.**

### అదియునుం గాక.

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండ.

భావము:- అంతే కాకుండ.

**9-142-మ.**

ఒకమాటెవ్వని పేరు కర్ణములలో నొయ్యారమై సోఁకినన్
సకలాఘంబులు పల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో నట్టి స
త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశుని
న్నకలంకస్థితిఁ గొల్చు భక్తులకు లే దడ్డంబు రాజాగ్రణీ!

టీక:- ఒక = ఒక్క; మాటు = సారి; ఎవ్వని = ఎవనియొక్క; పేరు = నామము; కర్ణముల = చెవుల; లోనన్ = అందు; ఒయ్యారము = విలాసముగా; ఐ = అయ్యి; సోకినన్ = స్పర్శించినను; సకల = సమస్తమైన; అఘంబులున్ = పాపములు; పల్లటిల్లి = పటాపంచలై, చలించి; తొలగున్ = పోవును; సంభ్రాంతి = భయభ్రాంతుల; తోన్ = తోటి; అట్టి = అటువంటి; సత్సుకరున్ = నారాయణుని {సత్సుకరుడు - సత్ (మంచి) సుకరుడు (మేలు) కరుడు (కలిగించువాడు), విష్ణువు}; మంగళతీర్థపాదున్ = నారాయణుని {మంగళతీర్థపాదుడు - శుభకరమైన తీర్థము పాదములవద్ద కలవాడు, విష్ణువు}; హరిన్ = నారాయణుని; విష్ణున్ = నారాయణుని; దేవదేవేశునిన్ = నారాయణును; అకలంక = నిష్కళంకమైన; స్థితిన్ = విధముగా; కొల్చు = సేవించెడి; భక్తులు = భక్తుల; కున్ = కు; లేదు = లేదు; అడ్డంబు = సాధ్యముగానిది; రాజ = రాజులలో; అగ్రణీ = గొప్పవాడ.

భావము:- రాజశేఖరా! సత్సుకరుడు, మంగళతీర్థపాదుడు, అయిన మహా విష్ణువు నామాన్ని ఒక్క సారి చెవులారా స్పర్శించిన మాత్రంచేతనే సమస్త పాపములు పటాపంచలు అయిపోతాయి. అటువంటి ఆ నారాయణుని నిష్కళంక భక్తులైన నీవంటి వారికి సాధ్యం కానిది లేదు.

9-143-మత్త.

తప్పు లోఁగొని చక్రపావక దాహముం బెడఁబాపి తౌ
నొప్పునొప్పు భవద్దయారస మో నరేశ్వర! ప్రాణముల్
చెప్ప మున్నును వోయి క్రమ్మఱఁ జేరె ధన్యుఁడ నైతి నీ
కెప్పుడుస్ శుభ మేను గోరెద నింకఁ బోయెద భూవరా!"

టీక:- తప్పుస్ = తప్పిదమును; లోగొని = మన్నించి; చక్ర = సుదర్శన చక్రము; పావక = మంటల; దాహముస్ = మాడిపోవుటను; ఎడబాపితి = తప్పించితివి; ఔస్ = గొప్పది; ఒప్పునొప్పు = చాలాసరియైనదది; భవత్ = నీయొక్క; దయారసము = కృపాదృష్టి; ఔస్ = గొప్పది; నరేశ్వర = రాజ; ప్రాణముల్ = ప్రాణవాయువులు; చెప్పస్ = చెప్పవలెనంటే; మున్నును = ముందు; వోయి = పోయి; క్రమ్మఱస్ = తిరిగి; చేరెస్ = వచ్చినవి; ధన్యుడను = ధన్యుడిని; ఐతిస్ = అయ్యాను; నీ = నీ; కుస్ = కు; ఎప్పుడును = ఎల్లప్పుడు; శుభము = శుభముజరగవలెనని; ఏను = నేను; కోరెదస్ = కోరుకుంటాను; ఇంక = ఇక; వోయెదస్ = వెళ్లెదను; భూవరా = రాజా {భూవరుడు - భూమికిభర్త, రాజు}.

భావము:- ఓ రాజా! నా తప్పిదాన్ని మన్నించి సుదర్శనచక్రం మంటల్లో మాడిపోకుండా కాపాడావు. నీ కృపాదృష్టి చాలా గొప్పది. చెప్పాలంటే నా ప్రాణాలు పోయి తిరిగి వచ్చాయి. ధన్యుడిని అయ్యాను. నీకు సదా శుభాలు జరగాలని కోరుతున్నాను. ఇక సెలవు."

**9-144-క.**

అనిన విని రాజముఖ్యుఁడు
మునివల్లభు పాదములకు మ్రొక్కి కడుస్ మ

న్ననచేసి యిష్ట భోజన

మనువుగఁ బెట్టించెఁ దృప్తుఁ డయ్యె నతండున్.

టీక:- అనినన్ = అనగా; విని = విని; రాజముఖ్యుడు = మహారాజు; ముని = మునులలో; వల్లభు = శ్రేష్ఠుని; పాదముల్ = పాదముల; కున్ = కు; మ్రొక్కి = నమస్కరించి; కడున్ = మిక్కిలి; మన్నన = మర్యాద; చేసి = చేసి; ఇష్ట = ఇష్టపడెడి; భోజనమున్ = భోజనమును; అనువుగన్ = చక్కగా; పెట్టించెన్ = పెట్టించెను; తృప్తుడు = తృప్తిచెందినవాడు; అయ్యెన్ = అయ్యెను; అతండున్ = అతడు;

భావము:- అనగా విని మహారాజు మునిశ్రేష్ఠుని పాదాలకు నమస్కరించి గొప్ప మర్యాదలు చేసాడు. ఇష్టమైన భోజనం పెట్టించాడు. అతడు తృప్తిచెందాడు.

9-145-వ.

మఱియు నమ్మునీంద్రుం డిట్లనియె.

టీక:- మఱియున్ = ఇంకను; ఆ = ఆ; ముని = మునులలో; ఇంద్రుడు = శ్రేష్ఠుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇంకను ఆ మునిశ్రేష్ఠుడు ఈ విధంగ అన్నాడు.

9-146-శా.

"కంటిన్ నేఁటికి నిన్ను నీ వచనముల్ కర్ణద్వయిం బ్రీతిగా

వింటిన్నన్నముఁ గొంటి నీ గృహమునన్ వేడ్కన్ ఫలం బందె నే

మంటిం బోయెద; నీ చరిత్ర మమరుల్ మర్త్యుల్ సుఖాసీనులై

మింటన్ మేదిని సన్నుతింపఁగల రీమీఁదన్ నరేంద్రాగ్రణీ!"

టీక:- కంటిన్ = చూసితిని; నేటికిన్ = ఇప్పటికి; నిన్నున్ = నిన్ను; నీ = నీయొక్క; వచనముల్ = మాటలను; కర్ణ = చెవులు; ద్వయంబున్ = రెంటి (2); ప్రీతిగా = ఇష్టపూర్వకముగా; వింటిన్ = విన్నాను; అన్నమున్ = ఆహారము; కొంటిన్ = తీసుకొన్నాను; నీ = నీయొక్క; గృహమునన్ = ఇంటిలో; వేడ్కన్ = సంతోషముతో; ఫలంబు = ఫలితము; అందెన్ = దక్కినది; ఏన్ = నేను; మంటిన్ = బతికితిని; వోయెదన్ = వెళ్ళిపోయెదను; నీ = నీయొక్క; చరిత్రమున్ = కథను; అమరుల్ = దేవతలు; మర్త్యుల్ = మానవులు; సుఖ = సుఖముగా; ఆసీనులు = కుర్చొన్నవారు; ఐ = అయ్యి; మింటన్ = స్వర్గమునందు; మేదినిన్ = భూమ్మీద; సన్నుతింపగలరు = కీర్తించెదరు; ఈమీదన్ = ఇకపైన; నరేంద్రాగ్రణీ = మహారాజా {నరేంద్రాగ్రణి - నరేంద్రు (రాజు)లలో అగ్రణి (అదికుడు), మహారాజు}.

భావము:- “అంబరీష మహారాజా! నేటికి నిన్ను కళ్ళారా చూసాను. ఇప్పటికి నీ మాటలను చెవులారా విన్నాను. నీ ఇంటిలో తృప్తిగా భోజనం చేసాను. ఫలితం దక్కింది. నేను బతికిపోయాను. ఇక సెలవు వెళ్తాను. నీ కథను దేవతలు మానవులు స్వర్గంలో భూమ్మీద కీర్తిస్తారు.”

9-147-వ.

**అని చెప్పి దుర్వాసుం డంబరీషుని దీవించి కీర్తించి మింటి తెరువున బ్రహ్మలోకంబునకుం జనియె, మునీశ్వరుండు వచ్చి మగుడం జనువేళకు నొక్కవత్సరంబు నిండి వ్రతంబు పరిపూర్ణం బైన.**

టీక:- అని = అని; చెప్పి = చెప్పి; దుర్వాసుండు = దుర్వాసుండు; అంబరీషుని = అంబరీషుని; దీవించి = ఆశీర్వదించి; కీర్తించి = పొగిడి; మింటి = ఆకాశ; తెరువునన్ = మార్గములో; బ్రహ్మలోకంబున్ = బ్రహ్మలోకమున; కున్ = కు; చనియెన్ = వెళ్ళిపోయెను; ముని = మునులలో; ఈశ్వరుండు = ఉత్తముడు; వచ్చి = వచ్చి; మగుడన్ = తిరిగి; చను = వెళ్ళెడి; వేళ = సమయమున; కున్ =

కు; వత్సరంబున్ = సంవత్సరము; నిండి = పూర్తయిపోయి; వ్రతంబు = వ్రతము; పరిపూర్ణంబు = సంపూర్ణము; ఐనన్ = కాగా.

భావము:- అని చెప్పి దుర్వాసుండు అంబరీషుని ఆశీర్వదించి, పొగిడి, ఆకాశమార్గాన బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు. మునీశ్వరుడు వచ్చి తిరిగి వెళ్ళిన సమయానికి సంవత్సరం పూర్తయిపోయి వ్రతం సంపూర్ణము అయింది. కనుక....

9-148-ఆ.

అవనిసురుఁడు గుడువ నతి పవిత్రంబైన
వంటకంబు భూమివరుఁడు గుడిచెఁ
దపసి నెగులు మాన్పఁ దానెంత వాఁడను
హరి కృపామహత్వ మనుచుఁ దలఁచి.

టీక:- అవనిసురుండు = బ్రాహ్మణుడు {అవనిసురుడు - అవని (బూమికి) సురుడు (దేవత), విప్రుడు}; కుడువన్ = తినుటచేత; అతి = మిక్కిలి; పవిత్రంబు = పవిత్రమైనది; ఐనన్ = అయినట్టి; వంటకంబున్ = భోజనపదార్థమును; భూమివరుడు = రాజు {భూమివరుడు - భూమికి భర్త, రాజు}; కుడిచెన్ = తినెను; తపసి = మునియొక్క; నెగులున్ = కష్టమును; మాన్పన్ = పోగొట్టుటకు; తాన్ = తను; ఎంతవాఁడను = అంతసమర్థుడను కాను; హరి = విష్ణుని; కృపా = దయయొక్క; మహత్వము = గొప్పదనము, ప్రభావము; అనుచున్ = అంటు; తలచి = భావించి.

భావము:- బ్రాహ్మణుడు దుర్వాసుడు భుజించాక రాజు భోజనం చేసాడు. ముని కష్టం పోగొట్టింది విష్ణుదేవుని దయాప్రభావం తప్ప నేను అంతటి సమర్థుడను కాను అని అంబరీషుడు భావించాడు.

9-149-వ.

మఱియును.

టీక:- మఱియును = ఇంకను. భావము:- ఇంకను.

9-150-క.

హరి గొల్చుచుండువారికిఁ

పరమేష్ఠిపదంబు మొదలు పదభోగంబుల్

నరకసమము లను తలఁపున

ధరణీ రాజ్యంబుతోడి తగులము మానెన్.

టీక:- హరిన్ = విష్ణుమూర్తిని; కొల్చుచుండు = సేవించెడి; వారి = వైరల; కిన్ = కు; పరమేష్ఠి = బ్రహ్మదేవుని; పదంబున్ = పదవి, పీఠము; మొదలు = మొదలైన; పద = పదవీ; భోగంబుల్ = భోగములు; నరక = నరకముతో; సమములు = సమానమైనవి; అను = అనెడి; తలపునన్ = భావముతో; ధరణీ = భూమండలమంతటి; రాజ్యంబున = రాజ్యాధికారము; తోడి = తోటి; తగులము = మోహమును; మానెన్ = వదలివేసెను.

భావము:- విష్ణుమూర్తిని సేవించె వారికి బ్రహ్మపదవి మొదలైన పదవీ భోగాలు నరకంతో సమానం అనెడి తలంపుతో, అంత గొప్ప రాజ్యాధికారం ఎడల మోహం వదలివేసాడు.

9-151-వ.

ఇట్లు విరక్తుండై.

టీక:- ఇట్లు = ఈలాగు; విరక్తుండు = కామాది జయించినవాడు; ఐ = అయ్యి.

భావము:- ఈ విధంగ కామాది షట్కాన్ని జయించి.....

9-152-ఆ.

తనకు సదృశులైన తనయుల రావించి

ధరణి భరము వారిఁ దాల్పఁ బంచి

కానననంబు చొచ్చెఁ గామాది విజయుఁడై
నరవిభుండు హరిసనాథుఁ డగుచు.

టీక:- తన = తన; కున్ = కు; సదృశులు = సాటివచ్చెడివారు; ఐనన్ = అయినట్టి; తనయుల్ = పుత్రులను; రావించి = పిలిపించి; ధరణిభరమున్ = భూభారమును; వారిన్ = వారికి; తాల్పన్ = భరించమని; పంచి = ఆజ్ఞాపించి; కాననంబు = అడవికి; చొచ్చెన్ = వెళ్ళిపోయెను; కామాది = అరిషడ్వర్గములను {కామాది - 1కామ 2క్రోధ 3లోభ 4మద 5మోహ 6మాత్సర్య అనెడి వర్గ శత్రులు, అరిషడ్వర్గములు}; విజయుడు = జయించినవాడు; ఐ = అయ్యి; నరవిభుండు = రాజు {నరవిభుడు - మానవులప్రభుపు, రాజు}; హరి = విష్ణుమూర్తిని; సనాథుడు = అండగాగలవాడు; అగుచున్ = ఐ ఉండి.

భావము:- అలా అరిషడ్వర్గాలను జయించిన అంబరీషుడు, తనకు సాటివచ్చె పుత్రులను పిలిపించి రాజ్యభారం వారికి అప్పజెప్పి. విష్ణుమూర్తిని అండగాగొని అడవికి వెళ్ళిపోయాడు.

9-153-క.

ఈ *యం*బరీషు చరితముఁ
దీ*యం*బున విన్నఁ జదువ ధీసంపన్నుం
డై *యుం*డును భోగపరుం
డై *యుం*డును నరుఁడు పుణ్యుఁడై యుండు నృపా!

టీక:- ఈ = ఈయొక్క; అంబరీషున్ = అంబరీషుని; చరితమున్ = కథను; తీయంబునన్ = ఆసక్తితో; విన్నన్ = వినినను; చదువన్ = చదివినను; ధీ = జ్ఞానము; సంపన్నుండు = అదికముగాగలవాడు; ఐ = అయ్యి; ఉండును = ఉండును; భోగపరుండు = వైభోగములుగలవాడు; ఐ = అయ్యి; ఉండును =

ఉండును; నరుడు = మానవుడు; పుణ్యుడు = పుణ్యాత్ముడు; ఐ = అయ్యి; ఉండుస్ = ఉండును; నృపా = రాజా {నృపా - నరులను పాలించువాడు, రాజు}.

భావము:- ఓ పరీక్షిన్మహారాజా! ఈ అంబరీషుని కథను ఆసక్తితో విన్న వాడు, చదివిన వాడు గొప్ప జ్ఞానవైభోగాలు పొంది పుణ్యాత్ములు అవుతారు.

## స్తోత్రము

9-735-మాలి.

జగదవనవిహారీ! శత్రులోకప్రహారీ!
సుగుణవనవిహారీ! సుందరీమానహారీ!
విగతకలుషపోషీ! వీరవిద్యాభిలాషీ!
స్వగురుహృదయతోషీ! సర్వదా సత్యభాషీ!

టీక:- జగదవనవిహారీ = శ్రీరామా {జగదవనవిహారుడు - లోకముల రక్షణకై సంచరించెడివాడు. రాముడు}; శత్రులోకప్రహారీ = శ్రీరామా {శత్రులోకప్రహారుడు – శత్రువులందరిని దండించెడివాడు, రాముడు}; సుగుణవనవిహారీ = శ్రీరామా {సుగుణవనవిహారుడు- సుగుణములనెడి వనమునందు విహరించువాడు, రాముడు}; సుందరీమానహారీ = శ్రీరామా {సుందరీమానహారుడు - అందగత్తెల అభిమానమును అపహరించువాడు, రాముడు}; విగతకలుషపోషీ = శ్రీరామా {విగతకలుషపోషుడు- విగతకలుష (పుణ్యాత్ములను) పోషించువాడు, రాముడు}; వీరవిద్యాభిలాషీ = శ్రీరామా {వీరవిద్యాభిలాషుడు - వీరత్వము చూపుటందు ఆసక్తికలవాడు, రాముడు}; స్వగురుహృదయతోషీ = శ్రీరామా {స్వగురుహృదయతోషుడు- తన గురువుల మనసులను సంతోషపరచువాడు, రాముడు};

సర్వదాసత్యభాషీ = శ్రీరామా {సర్వదాసత్యభాషి - ఎల్లప్పుడు సత్యమునే పలుకువాడు, రాముడు} .

భావము:- లోకరక్షణకై విహరించువాడ! శత్రువు లందరిని దండించువాడ! సుగుణములనే వనముల యందు విహరించువాడ! అందగత్తెల అభిమానం చూరగొనెడివాడ! పుణ్యాత్ములను పోషించువాడ! వీరత్వం చూపు టందు ఆసక్తి కలవాడ! స్వయంగా గురువుల హృదయాలకు సంతోషం కలిగించువాడ! ఎల్లప్పుడు సత్యమునే పలుకువాడ! శ్రీరామ! నీకు నమస్కారములు.

## అఖ్యానంతగద్యము

ఇది జాతీయ మహాకవి శ్రీ బమ్మెఱ పోతనామాత్య ప్రణీతమైన

శ్రీమత్తెలుగు భాగవత మహాపురాణాంతర్గతంబైన సూర్యవంశారం

భంబును, వైవస్వతమనువు జన్మంబును, హైమచంద్రకథనంబును,

సుద్యుమ్నాదిమను సూనుల చరిత్రంబును, మరుత్తు, తృణబిందు,

శర్యాతి, కకుద్మి, సగర, నాభాగ ప్రముఖుల చరిత్రంబులును,

నంబరీషుని యందుఁ బ్రయోగింపబడిన దుర్వాసుని కృత్యనిరర్థక

యగుట యను కథలు గల అంబరీషాఖ్యానం సంపూర్ణం.

ఓం ఓం ఓం

ఓం శాంతిః శాంతిః శాంతిః

సర్వేజనాః సుఖినోభవంతు.

సర్వం శ్రీకృష్ణార్పణ మస్తు

- - -